# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్





ఏప్రిల్ 1968



సంపుటము: 45 : సంచిక : 4 :

విడిప్రతి వెల ఒక రూపాయి



10—4—68 చైత్ర శుద్ధ ద్వాదశి బుధవారం

శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి 30–వ. పుణ్యవర్ధంతి

ప్రవిమల జీవిత ప్రసృమర ప్రథితాకృతు లాత్తధర్మసా
ర వివశచిత్తు లార్యగుణరంజనమంజులదానవీరులున్
తవులరు నిన్నబోలు మహితాత్మకు లెచ్చట; నీవొకండవున్
అవగుణ సత్త్వహా తెలుగునాట వెలింగితి సత్యమూర్తివై.

# విషయానుక్రమణిక

## ఏప్రిల్ 1968

# ఆకుపచ్చదనం

శ్రీ ఇంద్రగంటి భానుమూర్తి

1

అందంగా మెరిసే ఆశాంచలాలను,
అందని ఆకాశాలను,
అందుకోవాలనీ, క్రిందికి దించుకోవాలనీ,
దిశాంచలాల కెగసీ,
చెట్లపై, గట్లపై, కానల్లో, కోనల్లో, తీవల్లో, తెరువుల్లో,
ఇంటి ముంగిటా, పుడమి తల్లి పందిటా
అచ్చటా, ఇచ్చటా, అంతటా
వెచ్చగా పొంగే, పచ్చగా పొంగే,
ఆకుపచ్చదనం—పచ్చి
ఆకు విచ్చు దనం —

2

పచ్చని చూపుతో,
పరువపు ఊపుతో,
ఒరసికొని, ఒరసికొని,
ఒకే ఒక్కశక్తిగా దూసుకొని,
ముందుకు చూస్తూ, మునుముందుకే పచ్చని బాహుశాఖలు చాస్తూ,
ఆహ్వానిస్తూ,
ఒరవళ్లతో, పరవళ్లతో వచ్చే ఆకుపచ్చదనం —
గిరులు గడులు ఎరగనిది పిచ్చి ఆకుపచ్చదనం —

3

జీవన జీమూత తటిద్వల్లిక,
ప్రణయాంగణ నవరంగ పల్లిక,
పల్యంకిక, నిలిచిన చోట —
నవ్వులు తుళ్లే చోట —

పన్నీటి పరిమళా లల్లే చోట –
గుమ్మంలో, గుండెల్లో, పందిరిలో, అందరిలో,

పచ్చగా ప్రాకే
పెచ్చుతనం – ఊగే
ఆకుపచ్చదనం –

4

వెన్నెల సోకినా – చిరు
వెచ్చని వెలుగే తాకినా,
ఏ మత్తు పీవలి వీచినా,
ఏ కొత్తగాలి ఊంచినా,
మెరిసేదీ, మెరిపించేదీ,
వెలిగేదీ, వెలిగించేదీ,
కదిలేదీ, కదిలించేదీ,
ఊగేదీ, ఊగించేదీ,
ఎల్లెడలా జృంభించేదీ,

ఆకు పచ్చదనం – పచ్చి
బాకు విచ్చు దనం—

5

ఎలుగులు, ఏవేవో పులుగులూ,
కుందేళ్ళూ, తోడేళ్ళూ;
రాళ్ళమీాంచి గెంతుతూ, గలగల పాడుతూ పోయే అమాయకపు సెలయేళ్ళూ,
అడవి చిందువులు, రాబందులు, కొండలు, గుహలూ, ముళ్ళూ, బండరాళ్ళూ,
పులులూ, పొదలూ ఒదిగిన మహాగహనం
ఓ మూల కారుచిచ్చులో పడ్డప్పుడు,
చిచ్చు చెలరేగినప్పుడు,
ఎలుగులూ, రాబందులూ తప్పించుకపోతూన్నప్పుడు,
లేళ్ళూ, కుందేళ్ళూ వీని మధ్యపడి నలిగిపోతూన్నప్పుడు,
అడవి తగలబడి పోతూన్నప్పుడు,
పచ్చగా ముందు నిలిచిఉన్నది,
చిచ్చుకి ఆహుతి అయిపోతూన్నది,

ఆకుపచ్చదనం—
ధాత్రీ గర్భ స్వచ్ఛ ధనం—

అరణ్యక భూములల్లోనూ, అధునాతన సీమలల్లోనూ,
శ్యామ తపస్సమాధి మగ్నమై, సంలగ్నమై
సత్ఫలితాన్ని చూపేదీ, చూపేదీ,
అందీ అందక మురిపించే శశిహాసనలోకాలకు చేజాపేదీ,
పూలమలుపులలోకి తొలిగా పచ్చనిపాదం మోపేదీ

ఆకుపచ్చదనం—

రెక్కలు విచ్చి, పునీతశ్లోకలోకాలు గడచివచ్చి,
సుశ్యామ సుందర పింఛం విప్పి నర్తించే,
ఈ విశ్వదేహళిని వర్తించే,

నెమ్మి పులుగు—
అరనిది ఆకుపచ్చని వెలుగు—

# "అపేక్ష...ఉపేక్ష"

శ్రీ వంగల వేణుగోపాలాచార్య

'జానకీ...'

కాంతయ్య వేసిన ఆ గావుకేకతో జానకమ్మ హడలిపోయింది. ఇంక తను ఏం మాట్లాడినా వ్యర్థ ప్రయాసం ఒళ్లు హూనం అవడమే అన్న సంగతి తన యిరవైఏళ్ల కాపురంలో అనుభవం. అందువల యింకేమీ మాట్లాడకూడదనుకొని, కాంతయ్య తెచ్చిన ఆ పుచ్చువంకాయల కుప్పముందు కూర్చొని ముక్కలు తరిగి, ఏరడం మొదలుపెట్టింది. ఇది అనాదిగా ఆ యింట్లో వస్తున్న ఆచారం. చవకలో తెచ్చిన వీశెల సంఖ్య, కాంతయ్య కొక వ్యవహార దక్షతలా గోచరిస్తే, వాటన్నిటినీ తరిగి, ఏరి, చివరకి మిగిలిన సవాశేరు కూర పదిమందికీ సద్దలేక జానకమ్మ సతమతమయ్యేది. 'పోనీ...ఆ తెచ్చే వాలు గయినా పెందరాళే వెళ్లి మంచికూరలు ఏరి పట్టాకూడదూ' అనేది జానకమ్మ. 'అది తగని ఖర్చుకి లక్షణం' అని కాంతయ్య వాదం. ఆ వాదం జరిగిన రోజున ఆ యింట్లో భోజనా లుండవు. అదీ కాంతయ్య పట్టు; జానకమ్మ యిక్కట్టు.

తన యీ యిరవైఏళ్ల కాపురంలోను, పెద్ద సమస్య లేవీ తన కంటకపోయినా, భగవంతు డిచ్చిన కొంపా, గోడూ తనకి నామమాత్రంగా కనుపిస్తున్నా, జానకమ్మ మనస్సులో యింకా ఏదో అపరిపూర్ణత వ్యాపించి ఉండేది.

తన మాటకి ఎదురేమీ రాకపోవడంతో, కాంతయ్య యింకో నాల్గు జానకమ్మని తిట్టి, తువ్వాలు దులిపి భుజాన వేసికొని విసురుగా యింట్లోంచి వీధిలోకి నడిచాడు. ఇంక తిరిగిరావడం పొద్దుగూకాకనే. ఇంట్లో పిల్లా—జెల్లా పెద్ద లంద రికీ వడ్డించి, వంటిల్లు సద్దుకొని, కాంతయ్యకోసం కళ్లల్లో వత్తులువేసికొని కూర్చోవాలి యిక.

సగం కన్నీళ్లతో పరధ్యానంగాఉన్న జానకమ్మ కత్తిపీటకి కోసుకున్న వేలిగాయం గమనించనేలేదు.

'అత్తా...'అన్న పిలుపు వినబడి, స్పృహలోకి వచ్చింది. తెలిసింది బాధ. చటుక్కున వేలిని నొక్కి పట్టుకుంది.

'ఉండత్త' అంటూ అప్పుడే వచ్చిన రమ వెంటనే ఒక పాతగుడ్డ సంపాదించి జానకమ్మ వేలికి చుట్టింది. 'అబ్బా...ఎంత రక్తం కారిందో' అంటూ వేలిని రాస్తోంది రమ. రమ తన ఆడపడుచు కామాక్షమ్మ కూతురు. ఎనిమిదేళ్ల రమ ఎంతో పరిశుభ్రంగా, తెల్లటి పరికిణీ, గౌనులో వెన్నెల శకలంలా మెరిసిపోతున్నది. ఎంతో శ్రద్ధంగా వేసిన రెండు జడలు, దీప్తి ఆకారంలో బొట్టూ, రాళ్ల గాజులూ, కామాక్షమ్మ తనకున్న ఆనందమంతా రమ లోనే చూపించిందా అనిపించింది జానకమ్మకి. ఒక్క క్షణం తెప్పరిల్లి 'ఏం తల్లీ...యిలా వచ్చావు' అంది.

'అమ్మ...యిది యిచ్చి రమ్మంది...' అంటూ తెల్లటి స్టీలు గిన్నె పళ్లెం మూతతో అందిచ్చింది. మూత తీయగానే గుభాళింపు ఒక్కసారిగా వెడలింది. ఎంతో జాగ్రత్తగా ఏరిన లేత వంకాయలని తరిగి, అన్ని వస్తువులూవేసి, అన్నగారి కిష్టమని కాంత య్యకి పంపింది, చెల్లెలు కామాక్షమ్మ. 'మళ్లీవస్తా నత్తా' అని రమ వెళ్లిపోయింది.

తనకి వంకాయకూర యింతకంటె బాగా చెయ్యడం తెలును. కాని తను పుచ్చువంకాయలు తరుగుతోంది. మనస్సులో ప్రేమ ముంచుకొస్తున్నా, కామాక్షమ్మ పంపిన కూర తనను వెక్కిరిస్తున్నట్టుగా ఊహించుకుంటోంది జానకమ్మ. ఇంత చిన్నవిషయం కూడ మనోవ్యథకి కారణమయింది.

అసలు జానకమ్మకి చిన్నతనంలో ఎన్నో విచిత్రమయిన ఊహలుండేవి. పుట్టిల్లు జమీందారీకాకపోయినా, ఎంతో సంపన్నంగా వినోదాలతో, విందులతో, నిత్యం ఏవో పండిత గోష్ఠులతో, వచ్చేపోయే అతిథి అభ్యాగతులతో ఎప్పుడవా యిల్లు కిటకిటలాడుతూండేది. చామన చాయలో, తెల్లటి పంచ, శాలువాలో, భారీ అయిన తండ్రి విగ్రహం, ఆయన ఉదాత్తశీలం ఎదుటి వాళ్లెవరినైనా సామంత రాజుల్లా తలవంచేట్టు చేసేది. ఆ ఊరి వాళ్లందరికీ ఆయన తలలోని నాలుకలా వ్యవహరించేవారు. అపర సరస్వతిలా ఆయన వ్యాసపీఠంముందు కూర్చుని పురాణం చెబుతుంటే, ఆ శ్రావ్యకంఠానికీ, విపుల వ్యాఖ్యానికీ ముగ్ధులై, గ్రామస్థులు కదిలేవారేకాదు. అందరికీ ఆయన 'అయ్యగారే.' ఆయన సంతానమంతా ఆడపిల్లలే. అందరిలోనూ జానకమ్మ అంటే ఆయనకి పంచప్రాణాలు. ఇద్దరక్కయ్యలు, ఇద్దరు చెల్లెళ్ల మధ్య...చిన్నప్పుడు చాల అల్లరి చేసేది. పెద్దపనులన్నీ అక్కయ్యలు చేస్తే, చిన్నపనులన్నీ చెల్లెళ్లకి పంచేసి జానకమ్మ రాచకార్యంచేసేది. అప్పటి ఆమె ఊహలు చిత్రాతి విచిత్రంగా ఉండేవి.

...'తానొక మహారాజు కుమార్తెలా, పదిమంది మీద పెత్తనంచేస్తూ, రాజాంతఃపురాలలో నివసించాలి. కలల్లోకూడ కష్టాలు తలవని కలిమిచెలిమిలో జీవితం ఒక అపూర్వ అనుభవాలిలా అత్యంతానందమై వెలుగులు విరజిమ్మాలి. అప్పటి కలలుకూడ, రాజకుమారులు, అంతఃపురాలతో చరిత్రాత్మక చిత్రాలలా వచ్చేవి.'

'అయిదుగు రాడపిల్లల పెళ్లిళ్లు ఎలా చెయ్యాలా' అన్నది సమస్యగా తోచలే దాతండ్రికి. ఎవరో, ఎందుకో, వచ్చేవారు. ఇల్లూ వాకిలీ, సంప్రదాయమూచూసి 'మీ అమ్మాయిని చేసుకుంటాం' అనేవారు. ఈయన 'అలాగే' అనేవారు. అంతే. అది ఒక ఆరుతరాల అనుబంధమయ్యేది. వివాహాలు జరిగేవి. ఏ సరుకులు ఎక్కడినుంచి వచ్చేవో...ఏ పనులు ఎవరు నిర్వహించేవారో... అదొక అపురూప సన్నివేశంలా కల్యాణం జరిగేది. అందరూ పెద్దలే... అందరూ పనివాళ్లే. అది ఒక గ్రామకార్యంలా భాసించేది.

జానకి వివాహంకూడ అలాగే జరిగింది. జీవితంలోని వాస్తవికాలకీ, తన మదిలోని ఊహలకీ పొత్తుకుదరక జానకమ్మ మొదట్లో చాల బాధపడింది. ఇప్పటికీ తన మనస్సు తనకే విచిత్రంగా ఉంది. తన చిన్ననాటి ఊహలు అలాగే ఉన్నాయి. వాస్తవికాలు ఎప్పటిలాగే వ్యతిరేకంగానే ఉన్నాయి. ఈ ఘర్షణలో, తనకి అప్పుడప్పుడు మంచీ చెడూ వివక్షతకూడ పోతోంది.

'కాకపోతే, కామాక్షమ్మ పంపిన కూర గుబాళింపులో తనకి కష్టమనిపించడానికేముందీ...'

ఈ ఆలోచనలతో సతమతమవుతూనే అందరికీ భోజనాలు వడ్డించింది జానకమ్మ. అన్నిపనులు ముగించుకొంది. ఆలస్యంగా వచ్చిన భర్త, తన ముఖంఅయినా చూడకుండా, తను వడ్డించినకూర తింటూ 'కూర బ్రహ్మాండంగా ఉంది. బంగారంలాంటికాయలు చవగ్గా తెస్తే...అతితెలివిపోయి...వంకపెడతావు' అని వెటకారిస్తుంటే...'ఆ కూర మీ చెల్లెలు పంపిందని' చెప్పాలా...వద్దా...అన్నది తేల్చుకోలేక నిలబడిపోయింది జానకమ్మ.

* * *

'వదినా...'అంటూ చూడవచ్చింది, ఆడపడుచు కామాక్షమ్మ. రోజూ ఏ అయిదారుసార్లో అయినా రాకుండా ఉండలేదు కామాక్షమ్మ. ఇరుగు పొరుగు అవడంతో యిళ్లు కలసిఉన్నట్టే అనిపించేది. రాత్రి ఫలహారాలకి పప్పురుబ్బుతున్న జానకమ్మ తలెత్తి చూసింది...

ఇంటిపనులన్నీ ముగించుకొని, భర్తని ఆఫీసుకి పంపి, పిల్లలని బడికిపంపి, తామభోజనంచేసి, హాయిగా తాంబూలం నములుతూవచ్చిన కామాక్షమ్మ మొహంలో అదొక వికాసమూ, చైతన్యమూ తొణికిసలాడుతున్నయ్.

'నువ్వు లే వదినా. నేను రుబ్బిపెడతాను' అంటూ రోలుముందు కూర్చుంది.

'అలాగే...నేను మరోపని చూసుకుంటా'నంటూ జానకమ్మ లేచి దొడ్లోకి వెళ్లింది పేడ తేవడానికి...

ఇల్లు అలకటం మొదలుపెట్టినప్పటినుంచీ జానకమ్మ ఆలోచనలన్నీ, కామాక్షమ్మ యింటిమీదే

ఉన్నాయి. కామాక్షమ్మ యిల్లు చిన్నది. మూడే గదులు...ఇల్లంతా గచ్చు, ముగ్గుల డిజైనుతో... ఉన్నంతలో ఎన్నో సదుపాయాలు అమర్చుకొంది. 'తనకే అలాంటి యిల్లుంటే ఎంత అందంగా అమర్చుకొని ఉండేది'...

చేతిలో పిడప వదలేసి ఒక్క నిట్టూర్పు వదిలింది జానకమ్మ.

అప్పటికే రుబ్బటం పని పూర్తిచేసివచ్చిన కామాక్షమ్మ అలకటం పని అందిపుచ్చుకొంది.

కామాక్షమ్మకి తన యింటిలో ఏ పనీ చేసుకొనే అవసరం ఉండదు. పనంతా పనివాళ్లో, పిల్లలో చేస్తారు. అన్నగారింటికి వచ్చి, వదినకి సాయం చేస్తూ ఉంటుంది. జానకమ్మకి యిది విచిత్రంగా ఉంటుంది. 'సహజంగా అడపడుచుతో ఆగర్భ శత్రుత్వముండాలి'...కామాక్షమ్మ కాపురం చూస్తే తనకి యీర్ష్య కల్గుతున్నదా...ఆ కామాక్షమ్మ నిజంగా దుర్మార్గురాలై ఉంటే...తను ఆమెను నానామాటలు అనే సావకాశం ఉంటే...మనస్సు కాస్త ఊరట చెందేదేమో!

అణగారిన ఆశలు...మనస్సులో ఏవో వికృత రూపాలు పొందుతున్నాయి.

* * *

జానకమ్మ ఒక్కగానొక్క కూతురు ఉమ. ఉమ వివాహమయింది......అదృష్టవంతుడయిన కాంతయ్య కుటుంబీకుడయినా, తండ్రిచాటు బిడ్డే. పెద్దలందరూ చేరి 'కన్యాదాతా...కాంతయ్యా...పీట మీద కూర్చోవయ్యా' అన్నారు. అంతే. కూతురు వివాహమయింది. ఈ విషయంలోకూడ జానకమ్మ ఊహలు ఫలించలేదు. తనకు అల్లుడు ఒక గొప్పవాడయి ఉండాలనీ, తన కూతురయినా యీ అనాగరిక వాతావరణం వదలి, కనీసం కామాక్షమ్మలా సుఖంగా ఉండాలని ఉంది.

వాస్తవిక జగత్తులోని అల్లుడు ఒక సంగీత కళాకోవిదుడై ఎప్పుడూ ఆ స్వరజగత్తులో మైమరచి ఉంటుంటే, తన ఉమకి భావి జీవితంలో యీ అన్నపానీయాలుకూడా కరువవుతాయేమో అని బాధపడేది జానకమ్మ. తాముంటున్నదొక మహానగరం అవటంతో, తన సంగీత సాధనకి కొత్తరూపం కల్గవచ్చునన్న ఆశతో అల్లుడెప్పుడవా యింట్లోనే ఉండేవాడు...దాదాపు యిల్లరికమయ్యాడు.

'తన ఊహాజగత్తులో......ఒక పెద్దమేడా, యింటినిండా దాసదాసీజనం, చూపరుల కళ్లు మిరుమిట్లు గొలిపే సంపదల వైభవాలతో తను హాయిగా భర్త, పిల్లలతో ఆనందంగా బీచికీ, సినిమాలకీ వెడుతూ, రోజు కొక పేరంటం చేస్తూ...'జానకమ్మ చాల గొప్పది...దొడ్డహృదయం కలది' అని అందరూ సేవలు చేస్తుంటే, తను సాటివారిలో ఠీవిగా, అందరి వందనాలు అందుకుంటూంటే, తనవాళ్లు తనను చూసి అసూయపడాలి... తను అది గ్రహించుకొని, ఏమీ! ఎరుగనట్టు తాను వారిని ఉడికించేయాలి...'కాని వాస్తవంలో వృద్ధులయినా అత్తమామల సేవలూ...వచ్చేపోయే బంధు జనులకి మర్యాదలూ తనకే విషయంలోనూ...ఒక్క కలహానికి తప్ప... అటు సలహాకిగాని యిటు సంప్రదింపులకిగాని తావివ్వని భర్త...అన్నిటినీమించి వేళాపాళా లేకుండా... యింటి సమస్యలతో సంబంధం లేకుండా... నట్టింట్లో కూర్చొని...అల్లుడుచేసే సంగీత సాధనా...ఇవన్నీ జానకమ్మ మనస్సులో ఎన్నో ఆలోచనలు రేపేవి. తాను లేకుండా క్షణం జరగని యీ యింట్లో, తన లెఖ్క ఎవ్వరికీ లేదు. అప్పుడప్పుడు దొడ్లో నూతిలోకి ఒక్కసారి దూకుదామనిపించేది...

...మనస్సులో జరిగే యీ నిరంతర భావ మథనం ఫలితంగా, కాస్త నిశ్చింతగా ఎవరయినా కనపడితే, 'అది వాళ్లు తనని వెక్కిరించడానికి వేసే వేషం'...అనుకునేది. దాంతో ఏవో అయినవీ...కానివీ...సంబంధంలేని సంగతులతో కాలాన్ని నింపుతూ ఉండేది. సాహిత్యంలో భాషకెన్ని అలంకారాలు, నానార్థాలు ఉన్నాయో, అవన్నీ జానకమ్మ నాలుకపై స్వేచ్ఛావిహారం చేసేవి.

'నల్లేరుపై బండిలా...' ఆ ధోరణి కామాక్షమ్మమీదికి తరచూ ప్రవహించేది...పాపం...కామా

క్షమ్మకి, జానకమ్మలోని యీ హృదయ మథనం తెలియక, తను మామూలుగా వస్తూ పోతూ ఉండేది.

*　　*　　*

కాలాన్ని చక్రంతో పోలుస్తారు విజ్ఞులు. వయస్సు మీరుతున్న కొద్దీ, అనుభవాలు చెరగని ముద్రలు వేస్తున్న కొద్దీ, ఆ కాలానికి యీ చక్ర సామ్యం క్రొంగొత్త అర్థాలతో, భావాలతో ద్యోతక మవుతుంది. జానకమ్మ కాపరానికి సంబంధించినంత వరకు అది ఒక పరమ సత్యం అయింది, అన్నికోణా లలో. చక్ర భ్రమణంలో ఆకులు పైకీ కిందికీ తిరి గినా, వాటిలో స్థానభేదం తప్ప, వస్తుభేదం, తత్వ భేదం ఉండదు.

జానకమ్మ యిప్పుడు తన ఒక్కగా నొక్క కూతురు ఉమ దగ్గరే ఉంటున్నది...గతించిన భర్త ఫోటోలోంచి చూస్తున్నాడన్న తృప్తి తప్ప, ఆయన జ్ఞాపకాలు ఎక్కువగా లేవు.

తన సంగీత సాధనలో పరాకాష్ఠ నందుకున్న జానకమ్మ అల్లుడు, అనుకోకుండా ఒక సంగీత కళా శాల ప్రిన్సిపాలవడం, యీ కాలభ్రమణాని కొక చిహ్నం...కూతురి కాపురం చూసుకుంటూ, మను మలతో కాలం గడపడమే ధ్యేయం అనుకున్నది జానకమ్మ.

*　　*

...తాను తొలిరోజుల్లో ఎలాంటి గృహ వాతావరణాన్ని పగటికలలు కన్నదో, ఆ జీవితం, తన కూతురు ఉమకి సాధ్యమయిందన్న విషయం, ఓనాడు, హఠాత్తుగ స్ఫురించింది...

ఆనాడు శనివారం...నిద్రలేచినప్పటినుంచీ జాన కమ్మ మనసు అదోలా ఉంది. ఆలోచనల బరువులో క్రుంగిపోతున్నట్టుంది. హాలులో రేడియో సుప్రభాతం పలుకుతుంటే, తను...తన గదిలో దేవుని మండపం ముందు కూర్చొని భక్తితో స్తోత్రాలు చదువు తోంది...ఇంటిలోని ఉదయం హడావిడి, గదిలోని అగరు, కర్పూరాల సువాసనలూ, దూరంలో మనుమల అల్లరీ...కేకలూ...మేడమీదనుండి వినవడే, అల్లుని వీణ సాధనా, జానకమ్మని తాను ఒక విచిత్రలోకంలో ఉన్నట్టు భ్రమింపచేస్తున్నాయ్.

జానకమ్మ నెమ్మదిగా పూజ ముగించుకొని గదిదాటి వచ్చింది. అప్పటికే పూజ ముగింపుకోసం, గుమ్మంలో కాచుకొని ఉన్న మనుమలు అమ్మమ్మ యిచ్చిన ప్రసాదం అందుకొని, తిరిగి పరుగెత్తుకొని పోయారు, ఆటలకోసం. జానకమ్మ హాలులోకి వచ్చింది...

...అధునాతనంగా అలంకరింపబడిన హాలు, చూసి తృప్తిగా నిట్టూర్పు వదిలింది. మెల్లిగా నడుస్తూ వంటింటివైపు వెళ్ళింది. ఉమ భర్త కోసం ఏదో ఫలహారం చేస్తున్నది. కాల్‌గస్ పొయ్యి మీద ఒకవైపు వంటయిపోతున్నది. గోడల్లోనే అమర్చిన అలమారులూ...విశాలమయిన అరుగుల మీద అందంగా పేర్చిన ఖరీదయిన సామానూ...

'అమ్మా...కాఫీ తీసుకో' అంటూ మెరుస్తున్న వెండిగ్లాసు అందిచ్చింది ఉమ.

ఆ గ్లాసందుకొని, నెమ్మదిగా నడుస్తూ పెరటిలోనికి వెళ్ళింది జానకమ్మ. ఇంటిచుట్టూ బోలెడు స్థలం. పెరట్లో యింకా పెద్దస్థలం. గేటునుండి పోర్టికోదాకా ఎంతో అందంగా, రకరకాల పూలమొక్కలు పెంచారు. పెరట్లో కూరగాయల పాదులు జానకమ్మ స్వయంగా వేసింది. సహజంగానే, కొబ్బరి, జామ, బొప్పాయి, సీతాఫలంలాంటి చెట్లు ఎన్నో ఉన్నాయి. మిగిలిన స్థలంలో, వాటిమధ్య, ఎంతో నేర్పుగా కూరగాయల పాదులెన్నో పెట్టింది. ఆ నేర్పు, చుట్టుపక్కల వాళ్ళనేకాక, తననికూడ ఆశ్చర్యపడేట్టు చేసింది. ఏవేళకావి వేళయినా దొడ్డి అంతా తిరగేస్తే, పదియిళ్ళకి సరిపడా కూరలు దొరకుతాయి. నాలుగైదు రోజుల కొకసారి, సన్ని హితులందరికీ, కూరలు పంపకం చేస్తూ ఉంటుంది... జానకమ్మ ఆ దొడ్డినంతా చూసుకుంటూ, తిరిగి, వీధిగేటువయిపు వచ్చింది. అక్కడ ఉన్న నవుకరు ద్వారా కాఫీగ్లాసు యింట్లోకి పంపి, తను పూల మొక్కలన్నిటినీ పరామర్శిస్తోంది.

గేటుదగ్గర రిక్షా ఆగిన చప్పుడయి తిరిగి చూసింది జానకమ్మ. రమ, యిద్దరు పిల్లలతో, రిక్షా దిగుతోంది...రిక్షావాడిని పంపేసి, యింటికేసి నడుస్తున్నది. పిల్లలిద్దరూ పూల మొక్కలు ఉల్సా

హంగా చూస్తూ తల్లివెంట నడుస్తున్నారు... ముక్కం మధ్య ఉన్న జానకమ్మ నెమ్మదిగా వెనుదిరిగి, యింట్లోకి వెళ్ళేసరికి, రమ ఉమలు నవ్వుతూ మాట్లాడుకుంటున్నారు. జానకమ్మని చూడగానే, వచ్చి, పాదాలంటి నమస్కరించింది రమ. ఏమేమో చెప్పుకొని పోతున్నది. 'వాళ్ళాయనకి ఆవూరే బదిలీ అయిందిట. వచ్చి రెండునెల లయినా, యీనాటికి కాస్త వీలుచిక్కిందట రావడానికి...ఆయనెప్పుడూ కాంపులేగాని...ఊళ్ళో ఉండరట'...ఆదరంగా అన్నీ వింటూనే, రమని పరీక్షగా చూసింది జానకమ్మ. పూర్ణారోగ్యంతో, ఎంతో అందం తొణికిసలాడుతుంటే భేదం ఎరుగని ఆనందంతో వెల్లిపోతున్నదా అన్నట్లుంది రమ.

'అదేమి టత్తా అలా చూస్తావు... నేను... నీ రమని' అంటూ తన యిద్దరుపిల్లలనీ ముందుకు తోసింది రమ. వాళ్ళు ఎంతో బుద్ధిమంతుల్లా నవ్వుతూ తనచుట్టూ తిరిగి ఆడుకుంటున్నారు.

'నే వెళ్ళొచ్చాశానూ... ఉమా ...హీటర్‌మీద స్టెయిన్‌లెస్ గిన్నెలో పోసిన వాల్యుపేర్లపాలు యింకా కాగలేదూ...త్వరగా కాస్త మీగడతీసి పలకల వెండి గ్లాసులో తీసుకొనిరా తల్లీ...అన్నట్టు మొన్న పండక్కి కొన్న వాల్యు టెరిలిన్ చీరలూ... జాకెట్లు...బాత్‌రూమ్‌లో పంపుకింద వానిపోతున్నాయి. పనిదానితో వాటిని వెంటనే ఉతకమని చెప్ప'...అంటూ పూజామందిరంలోకి వెళ్ళింది.

అంతవరకూ, రమకి కాఫీ యివ్వబోయిన ఉమ అలాగే నిలబడి వింటోంది. తెల్లబోయి తల్లికేసి చూస్తోంది ఏమీ అర్థంకాక. 'అదే...కాస్త మీగడలే...అంటే పోయేదానికి...అంత దండకమేమిటా అని' అంది ఉమ; 'ఎందుకే...అలా తెల్లబోయి చూస్తావు...అత్త నిన్ను మీగడ తెమ్మంటే' అన్న రమతో...

ఇంతలో 'నా కండువా ఏదీ' అంటూ ఉమాపతి రావడంతో వాళ్ళు సంభాషణ ఆపి పనుల్లో నిమగ్నులయ్యారు.

*　　　*　　　*

ఒకనాడు అనుకోకుండా; రమా ఉమా సినిమా హాలులో కలిశారు. వాళ్ళ భర్తలు సినిమా చూడ్డంలో మునిగిఉన్నారు.

సంబంధం లేకపోయినా యిద్దరాడవాళ్ళు కలిసి మాట్లాడుకున్నట్లు మగవాళ్ళు కలియరు. అలాంటిది, రమ ఉమ చిన్నప్పటినుంచి ఒక్కచోట పెరిగారేమో...బాంధవ్యకంటే స్నేహం ఎక్కువయిన వాళ్ళు, 'ఏమే రమా...మీ యింటికి వద్దామనుకున్నానే...నువ్వేమో మళ్ళీ రాలేదు'...' అని ఉమ అంటే, నేనూ వద్దామనుకున్నా...కాని...యిదిగో... మీ అన్నగారు క్యాంపులు మానేసి యింట్లో కూర్చున్నారు...ఏంచెయ్యను' అంది రమ నవ్వుతూ...

ఈ నవ్వులో రమాపతీ, ఉమాపతీ, మాటలు కలిసి, లోకాభిరామాయణంలో పడ్డారు. సినిమాలోని సంగీతాన్ని ఉమాపతి విమర్శిస్తుంటే...అందులోని సాహిత్యాన్ని రమాపతి మెచ్చుకుంటున్నాడు. సినిమా వదలగానే అందరూ హాలుబయటికి వచ్చారు.

'ఉమా...ఇప్పుడింక యింటికి ఏంవెడతారే... యీ పూటకి మాయింటికి రండి. పొద్దున్నే వెడుదురుగాని' అంది రమ.

రమాపతి, ఉమాపతిని బలవంతంచేసి ఒప్పించాడు చివరకి...

*　　　*　　　*

సినిమాకి వెళ్ళిన నాటి రాత్రి యింటికి రాకుండా, అల్లుడూ కూతురూ, రమ వాళ్ళింట్లో గడపారన్న విషయం తెలిసినప్పటినుంచి, అదేదో జరుగరానిదని జరిగినట్టు భావించ సాగింది జానకమ్మ. ఆ భావాన్ని ఎంత గుప్తద్వారంలో ఉంచుదామన్నా, ఉమకి యీ విషయం స్పష్టంగా తెలిసిపోతూనే ఉంది.

'ఎందుకే అమ్మా...అంత బాధపడతావు? రమ ఏమన్నా పరాయిదా? ఎప్పుడూ వాళ్ళయింటికి వెళ్ళలేదుకదా అని, సరదాగా వెళ్ళాము. ఈ విషయం రమకి తెలుస్తే ఎంత బాధపడుతుందో' అన్నది ఉమ తల్లితో.

ఉమ అన్నదాంట్లో నిజం ఉందని జానకమ్మకి తెలుసు. ప్రత్యేకించి రమ వాళ్ళమీద యింత ఉపేక్ష

ఎందుకు? జానకమ్మ హృదయంలో ఎన్నో విరుద్ధ భావాలు కల్లోలంగా ఉన్నాయ్.

* * *

మరువాడు ఉదయమే, వియ్యంకుడు పోయాడన్న కబురందుకొని, అల్లుడూ కూతురూ, స్వస్థలం వెళ్ళారు. పిల్లలని చూసుకుంటూ జానకమ్మ ఉండి పోయింది ఒంటరిగా. ఈ విషయం తెలిసిన రమ, వెంటనే వచ్చి, జానకమ్మకి సాయంగా ఉంటోంది. జానకమ్మ పూజాదికాలు ముగించుకొని వచ్చేటప్పటికి, పాలు సిద్ధంగా ఉంచేది. ఆమె పెరడులోని మొక్క లన్నిటినీ పరామర్శించి వచ్చేటప్పటికి, రమ పిల్లలూ, ఉమ పిల్లలూ...తమ తగాదాలు తీర్చమంటూ వచ్చే వారు. తన కూతురు పిల్లలతో సమానంగా రమ పిల్లలు ఆడుతుంటే.....తిరుగుతుంటే....ఆ పసి హృదయాలు వారి మరోలోకంలో విహరిస్తుంటే... తన కెందుకో రక్కుకుంటున్నట్టుండేది జానకమ్మకి....

...ఆ నాటిరాత్రి పెద్ద గాలి వానా వచ్చాయి. పిడుగులు ఉరుములతో వానాబీభత్సంగా, కుండపోతలా వర్షం....తుఫాను గాలుల మధ్య....ఎంతో ఆలస్యంగా తెల్లవారింది.

జానకమ్మ పెందలకడే లేచి, తోటలోకి వెళ్ళింది. తోటంతా వానాబీభత్సంగా ఉంది. తాను ఎంత శ్రద్ధగానో ప్రోదిచేసి, పెంచిన మొక్కలన్నీ సమూలంగా లాగబడి ఉన్నాయి. అక్కడా...అక్కడా కొన్ని మొక్కలుమాత్రం విస్సహాయంగా వ్రాలిఉన్నాయి. ఇదంతా స్తబ్ధహృదయంతో, నిలబడిపోయి చూస్తున్న జానకమ్మకి, మనస్సులో ఒక భావన మెరిపింది...

...హఠాత్తుగా భర్త పోవడంతో తన జీవితం యిలానే అయిందికదా...అని. ఇప్పుడాయనే ఉంటే, తన గారాలకూతురి కాపురంచూసి, అల్లుని హోదా చూసి ఎంత సంతోషించి ఉండేవారో...వెంటనే మనస్సులో ఒక కారుమేఘం క్షణం మెరిసి మాయ మయ్యింది...ఆయన క్రోధాధికం యిప్పటికి మరీ వృద్ధి అయిఉండేదేమో...కాని ఆ భావం భర్త స్మృతి భావ భారంక్రింద నిలవలేదు. జానకమ్మ మన స్సంతా ఆ నాడు వికలంగానే ఉంది. అన్నంకూడా సరిగా తినలేదు.

...ఆనాడు సాయంకాలం...తన తోటలో కనవడ్డ ఓ దృశ్యం చూసి విస్తుపోయింది జానకమ్మ... రమ, ఆమె పిల్లలూ, ఉమ పిల్లలూ...అందరూ కలసి హడావిడిగ తోటంతా బాగు చేస్తున్నారు. పాత తీగలు లాగేయడం...పందిళ్ళు సరిచేయడం...కొన ఊపిరిలో ఉన్న తీగెలని జాగ్రత్తగా పాకించడం...దారు లన్నీ ఉత్సాహంగా ఊడ్చేస్తున్నారు. అందరి మొహా ల్లోనూ ఆనందం ఉత్సాహం గోచరిస్తోంది.. రమ పిల్లలతో సమానంగా ఆనందంతో, ఆ తోటకి ఒక రూపు తీరుద్దామని కృషి చేస్తున్నది...'యిదిగో... అమ్మలూ...అత్త వచ్చేటప్పటికి యీ తోటంతా కళ కళలాడుతూ ఉండాలి...' అని హెచ్చరికలు చేస్తోంది...

ఆ దృశ్యం చూస్తున్న జానకమ్మ హృదయంలో ఎంతో సంతోషం కల్గింది. తనూ వెళ్ళి ఎంతో ఉత్సాహంగా పాటుపడింది. అందరూ కలిసి తోటకి తిరిగి పూర్వపు రూపం కల్పించారు.

...ఆ రాత్రి ... నిద్రపోతున్న జానకమ్మకి ఎందుకో హఠాత్తుగా మెలకువ వచ్చింది. అప్పుడే గోడ గడియారం ఒంటిగంట కొట్టింది. గడియారం ప్రక్కగా, అటూ, యిటూ తన భర్త ఫోటో, వియ్యంకుడి ఫోటోలున్నాయి. 'వారిద్దరూ యీనాడు లోకంలో లేరు. కొంతకాలంపోతే తనూ ఉండదు...ఎవరు మాత్రం శాశ్వతంగా యిహంలో ఉండిపోతారు? ఉన్న వాళ్ళవాళ్ళలో యిన్ని ద్వేషాలు, కార్పణ్యాలు పెంచు కొంటే కలసివచ్చేదేముంది? చిన్నపిల్లల్లో ఉన్న రాగాలూ...అమరాగాలూ: పెంచితే...అవే వాళ్ళకి ప్రశాంత జీవితానిస్తాయి. వారి ఔన్నత్యానికి ఆధార

భూతాలవుతాయి. మనస్సుల్లోనే విషబిందువులు చిందించుకోవడం...చిందింపజేయడం మానవత్వం అని పించుకోదు...జీవితంలో సగం దరిద్రంతో...సేలి వంగా గడపడంతో...అది తీసిన బీటలలో సుగుణాలు యిరుక్కుపోయాయి.

...నిరంతరంగా జరిగే య్యా భ్రమణ, పరి భ్రమణాల్లో విశ్వంలో ఏ అణువూ...ఏ తత్వమూ... స్థిరంగా...శాశ్వతంగా ఉండదు. అది ఎప్పుడూ, విశ్వశ్రేయస్సుకై పరిణామబద్ధమై ఉంటుంది... కాని స్థిరంగా ఉండేది...యిరుసు కేంద్రంలాంటి ప్రేమైక హృదయం మాత్రమే.....తన మనస్సులోని విరుద్ధ భావాల ఘర్షణల్లో తట్టులా తేలిన మలి నాన్ని, తానే తీవ్రమైన ఆలోచనలతోనూ, పెంచు కొన్న ప్రేమశక్తితోనూ క్షాళనం చేసుకొంది... అయినా, అయినవాళ్ల హృదయాలు ముక్కలు చేయకముందే మేల్కొంది జానకమ్మ ... లోకానికి అప్పుడే తెల్లవారింది....

* * *

ఒక విధమయిన వింత తేజస్సులో, అపర యోగినిలా వెలిగిపోతున్న జానకమ్మని పూజామంది రంలో చూసి రమ, తనకి తెలియకుండానే చేతులెత్తి నమస్కరించింది.......



# ఇపుడింకిపోయిన సముద్రం

శ్రీ దీవి సుబ్బారావు

నా గది సముద్రపుటొడ్డునే ఉండేది
సముద్రపుహోరు నా గదిలో ఉండేది
విన్పించేది కాదు
అధశ్చైతన్యంలోగాని నిద్రించేది గాదు
ప్రయత్నించినా గుర్తుకురాని జ్ఞానం —
కాళిదాసు 'రమ్యాణి వీక్ష్య' శ్లోకంలా ;
అకస్మాత్తుగా స్ఫురించినట్లు
ఎప్పుడో — ఆ ఎప్పుడు, ఎప్పుడో చెప్పలేం —
అప్పుడే సముద్రం పుట్టి పొర్లుతున్నట్టు ఉండి
హోరు హోరుమని గది శబ్దించేది
హోరు హోరుమని మది నినదించేది.

బాగా రాత్రివేళ
నిదుర నను వీడి దగా చేసినపుడు
ఎంతో కాలంగా గడియబడ్డ సముద్రుడి మూగతనం
ఏదో హఠాత్ఘటనవల్ల విడివడినట్లు
హోరుమంటూ రోద మొదలెడతాడు.
పోనీ సావకాశంగా విందామన్నా
ఎంతసేపూ ఏక శబ్దమేగాని
రోద కర్థమే ముంది?
రోదన కవధి యేముంది?

ఒకవేళ ఏమైనా
ఈయనగానీ పరాయి ప్రాంతాన్నుండి వచ్చాడో ఏమో ఎందుకైనా
ఎక్కడినుండయినా రాయబారేమో
అనవాలు పారేసుకొని కోటముందర మొరబెట్టుకునేందుకు.

లేక, ఎంతో రహస్యాన్నిగాని,
మహిమాన్విత మంత్రవాక్కును గాని
తన తరువాత ఎవరికన్నా
బాస తెలిసినవాళ్ళకి చెబుదామని
ఎంతో కాలంగా తపించి పోతున్నవాడేమో !

నిశ్చలంగా ఉన్న కొండ
ఎప్పుడూ రూపం మార్చుకునే ఇసుకవొడ్డు
బండలచుట్టూ చిన్న చిన్న నాచు
పది పన్నెండు కొబ్బరిచెట్లు
ఇసుకమీద గీతలుగీసే పీతలు
ఇంకా పైన చుక్కలు,
చంద్రుడు, సూర్యుడు, మబ్బులు
వస్తూ పోతూ వుండే గాలి
కెరటంమీద తుంపరలో ఎగిరే కాకి
వీరితో నేమో ఈ మహారాజు మంత్రాంగం !
అందరికీ సముద్రులుంగారి భాష వచ్చు
నీకూ నాకూ రాదు హైహారు భాష
రాదు కాబట్టి రొద అంటే
సరిపోయిందా !

సానుభూతితో వింటే
అనుభూతి లోతులు కనీసం తొంగిచూడొచ్చు.
సముద్రం మహా గడుసు
చూట్టానికి ముదురు నీలంగా కన్పట్టి
చేతిలోకి తీసికొంటే వేళ్ళమధ్యగా
రంగు జారిపోతుంది.
నమ్మి దగ్గరకొచ్చిన ఆడకూతుర్ని మగాళ్ళముందు
మోకాళ్ళదాకా తడిపి మోటసరస మాడుతుంది.
కర్రపుల్లో, గొడుగుకర్రో విసిరేస్తే
తరిఫీదు ఇచ్చిన కుక్కపిల్లలా తెచ్చి ఇస్తుంది.

మోసపోయి హవాయి చెప్పు లందిస్తే
ఒక టిచ్చి రెండోది ఎక్కడో పారేస్తుంది...

వర్షంనీరు పారి, ఫర్లాంగులెక్క సముద్రం
తడిసిన నీలంరంగు కోకకు
ఎర్ర బోర్డరులా వుంది.
తాంబూల చర్వణంతో ఎర్రబడ్డ నాలికను తిప్పి
చూసుకుంటున్నట్లు వుంది.
మృగాన్నివేసి, ఎర్రబడ్డ నోరుగల
సింహం దూకులాగుంది.
నీటి చివర్లు కొలిమిలో ఎర్రగా కాల్చినట్లుగా వుంది.
ఒడ్డున ఎర్రకలువలు పూచినట్లుగా వుంది.
వర్షం వెలిసినవేళ
ఆకాశవీధిలో పోతుండగా
వార్నకా(భఘులు చిందినయ్ గాబోలు
సముద్రం ఒడ్డున రథాన్ని దింపి
చక్రాలు కడుగుతూండగా
(మీరు నమ్మరుగాని)
సూర్యుణ్ణి చూశా న్నేను.

నా గది సముద్రపు టొడ్డునే ఉండేది.



# ఆర్థికరంగంలో విదేశీ సహాయం: లాభనష్టాలు

శ్రీ 'చంద్రశేఖర్'

అభివృద్ధి చెందుతున్న ఏ దేశానికైనా విదేశీ సహాయం అవశ్యకమౌతుంది. ఇందుకు ప్రధాన కారణం, ఆర్థికరంగంలో ప్రణాళికాబద్ధమైన పురోగతిని సాధించడానికి అవసరమైనంత పెట్టుబడి స్వదేశంలో లభించకపోవడమే. లభ్యమవుతున్న పెట్టుబడికీ, అవసరమైన పెట్టుబడికీ మధ్యనున్న లోటును ద్రవ్యోల్బణంద్వారా కాని, విదేశీ సహాయంవల్లకాని వర్తమానదేశంయొక్క ప్రభుత్వము భర్తీ చేసికొనవచ్చు. కాని, విజ్ఞతగల ఏ ప్రభుత్వమూ ద్రవ్యోల్బణంద్వారా ప్రగతిని సాగించేందుకు ప్రయత్నించదు; అది అసాధ్యంకూడా. ఎందువల్లంటే, సరైన బంగారపు నిల్వలు లేని నాణెములు, పత్రముల రూపంలోఉన్న ఉట్టిద్రవ్యాన్ని ఇతర దేశాలు అంగీకరించకపోవడంచేత అవసరమైన సాంకేతిక సామగ్రీ, దిగుమతులూ పొందలేము. కనుక ఈ పరిస్థితిలో ఏదోవిధమైన విదేశీ సహాయం పొంది ఆర్థిక ప్రగతికి సోపానా లేర్పరచుకొనడం తప్పనిసరి అవుతున్నది. అట్టి విదేశీ సహాయంయొక్క తత్వ్యమూ, లాభనష్టాలూ స్థూలంగా తెలుపడమే ఈ వ్యాసంయొక్క ప్రధానోద్దేశం.

విదేశీ సహాయం అంటే ఉచితంగా ఇవ్వబడిన ద్రవ్యం కాదు. అభివృద్ధి చెందిన దేశాలు, అభివృద్ధి చెందుతున్న దేశాలకు దీర్ఘకాల ప్రాతిపదికపై తక్కువ వడ్డీతో పెద్ద మొత్తాలు, ద్రవ్యరూపంలో కాని, సామగ్రిరూపంలోకాని ఋణా లివ్వడం ఈ సహాయంలో ప్రధాన భాగం. ఈ ఋణాలు రెండు దేశాల ప్రభుత్వాల మధ్య జరిగిన ఒడంబడికపై ఆధారపడి ఉంటాయి. సాంకేతిక శిక్షణ సహాయం కూడా ఈ పథకంలో భాగమే. తీసికొన్న ఋణాలు సరైన పద్ధతిలో ఉపయోగించేందుకు తగిన సాంకేతిక పరిజ్ఞానం లేకపోయిన పక్షంలో, వాని ప్రయోజనమే శూన్యమయ్యే ప్రమాదం ఉంది కనుక, అట్టి వ్యక్తుల నితర దేశాలనుండి రప్పించుకొనడం, లేదా, స్వదేశంలోని వారిని ఇతర దేశాలకు పంపి, శిక్షణ ఇప్పించడం చాలా ప్రధానమైన విషయం. సహజంగా ఋణదాతయైన దేశం కూడా ఈ విషయంలో శ్రద్ధ చూపుతుంది.

విదేశీ ద్రవ్యం మరొకవిధంగా కూడా సహాయకారి కావచ్చు. విదేశాలలోని పెట్టుబడిదారులు, వర్ధమాన దేశాలలో స్వయంగాకాని, ఆయాదేశాల పెట్టుబడిదారులతో కలిసి పాక్షికంగాకాని పరిశ్రమలను స్థాపిస్తారు. ఇందువల్ల విదేశీ పారిశ్రామికులు వర్ధమాన దేశాలలోని విపణిని ఉపయోగించుకొని చక్కని లాభాలు సంపాదించడమేకాకుండా, ఆ దేశాల ఆర్థిక, సాంకేతిక అభివృద్ధికి పరోక్షంగా తోడ్పడటం జరుగుతున్నది.

## 2

పైన వివరించబడిన విదేశీ ద్రవ్య సహాయాన్ని సాంఘికనీతి దృక్పథంలో ఈ విధంగా సమర్థించవచ్చు. ప్రపంచంలో మొత్తంగా ఉన్న ద్రవ్యసంపదను అన్నిదేశాల ప్రజలూ సమానంగా అనుభవించడం న్యాయం కనుక, ఏవో కొన్ని అవకాశాలూ కలిసివచ్చి, సౌభాగ్యవంతములైన దేశాలు వెనుకబడిఉన్న దేశాలకు సహాయం చేయడం వాని నైతిక బాధ్యత. మరిన్నీ, వర్ధమాన దేశాలలోఉన్న ఖనిజాలూ, నిద్రాణమై ఉన్న ఇతర నిక్షేపాలూ ఉత్పాదింపబడి ప్రపంచ సంపద పెరిగి, కాలక్రమంలో అన్నిదేశాలూ సమా

వంగా సంపన్నములయ్యే అవకాశం ఉంది. మరొక కారణ మేమంటే, అంతర్జాతీయ స్థాయిలో వాణిజ్యం సుస్థిరంగా, మరింత శక్తిమంతంగా నెలకొల్ప బడేందుకు అన్నిదేశాలూ సమానంగా పాల్గొనడం అవసరం.

విశాలదృక్పథంతో చూసినప్పుడు, ధనిక దేశాలు పై బాధ్యతను గుర్తించి బీదదేశాలకు సహాయం చేస్తాయికాని, వాస్తవంగా ఈ సహాయం అందించేందుకు మరికొన్ని పరోక్ష శక్తులు తోడ్పడు తున్నాయి. పెట్టుబడిదారీ దేశాలకూ, సామ్యవాద దేశాలకూ మధ్య స్పర్థ వృద్ధి చెందడంవల్ల రెండు వ్యవస్థలకూ ప్రతినిధులైన దేశాలు మధ్యస్థంగా ఉన్న బీదదేశాలకు పెద్ద మొత్తాలు సహాయంచేసి, తమ తమ పక్షాలలో వానిని చేర్చుకొనే ప్రయత్నం చేస్తున్నాయి. ఆయా రాజ్యాలు 'రాజకీయ సుస్థిరత' 'ఆర్థిక పురోగతి' అన్న నెపాలతో ఈ సహాయం కొనసాగించడం జరుగుతున్నది. సహాయంలోకూడా వృద్ధిచెందుతున్న స్పర్థను గూర్చి ఒక క్రైస్తవ మతగురువు ఈ విధంగా వ్యాఖ్యానించాడు.

'భగవంతుడు మన మందరమూ పరస్పర సహాయంతో జీవించాలని ఆశిస్తున్నాడు. ప్రేమలో ఈ పని సాధ్యం కానప్పుడు, ద్వేషంతోనైనా కొనసాగాలని ఆశిస్తాడు.'[1]

## 3

వెనుకబడిన దేశాలు అభివృద్ధి చెందేందుకు ఈ యుగంలో పారిశ్రామికీకరణకన్నా గత్యంతరం లేదు. కేవలం వ్యవసాయమే ప్రధానంగా ఉన్నదేశాలలో కూడా, ఆధునిక యంత్రవిధానాల నవలంబించడం వంటి మౌలికమయిన మార్పులు జరుగవలసి ఉన్నవి. ఇందు కవసరమైన సామగ్రినీ, విజ్ఞానాన్నీ ఇతర దేశాలనుండి దిగుమతి చేసుకోవాలి. వర్తమానదేశాల విదేశీ ద్రవ్యమారకపు విలువలు సాధారణంగా అతి తక్కువగా ఉంటాయి కనుక, ఈ దేశాలు అవసరమైన ద్రవ్యాన్ని ఋణాలద్వారా సంపాదించుకొంటాయి. ఈ విధంగా పొందిన ద్రవ్యంతో పరిశ్రమలు స్థాపించడంద్వారా స్వదేశంలో ఇంత వరకు నిద్రాణమై ఉన్న ఖనిజాలు ఉత్పాదింపబడుతాయి. క్రమంగా ఉత్పత్తి పెరిగి, దేశంలో సంపత్తి వృద్ధిచెందుతుంది. జాతీయాదాయమూ, తద్వారా వ్యక్తి ఆదాయమూ పెరిగి తిరిగి స్వదేశీ పెట్టుబడుల కవసరమైనంత ధనం ఉత్పత్తి అవుతుంది. బ్యాంకులలో ఉంచబడిన వ్యక్తుల నిక్షేపాలూ, (Savings), పరిశ్రమల లాభాలలో స్వంతదారులకు కొంతభాగం పంచగా తిరిగి పరిశ్రమలలో విక్షేపింపబడిన ద్రవ్యమూ (Retained Earnings) కలిసి, క్రొత్త పరిశ్రమలు ఏర్పడేందుకూ, ఉన్న పరిశ్రమలు మరింతగా అభివృద్ధిచెందేందుకూ అనువైన ప్రోత్సాహం లభిస్తుంది. ఈ విధంగా పెరుగుతున్న ఉత్పత్తులు ఎగుమతిచేసి, వర్తమానదేశం విదేశీ ద్రవ్యమారకం సమకూర్చుకొంటుంది. పూర్వపు ఋణాలనీ నిలువలతో నివృత్తం చేసికొని, ఆర్థిక స్వాతంత్ర్యాన్నీ, పురోగతినీ సాధించుకోవచ్చు.

ప్రభుత్వంద్వారా కాకుండా పెట్టుబడిదారుల వ్యక్తిగత ప్రయోజనాల ననుసరించి కూడా విదేశీ ద్రవ్యం అభివృద్ధి పొందుతున్న దేశాలలోనికి ప్రవహిస్తుందనుకొన్నాము. ఈ విధంగా విదేశీ పెట్టుబడులు, వర్తమానదేశంయొక్క స్థితిగతుల ననుసరించి, మూడు దశలలో ప్రవహించవచ్చు.[2]

(1) రాజకీయ స్వాతంత్ర్యంలేని పూర్తిగా వెనుకబడినదేశాలలో విదేశీపెట్టుబడిదారులు సాధారణంగా ఖనిజోత్పాదక పరిశ్రమలలోనూ, ప్రజాసంబంధమైన విద్యుచ్ఛక్తి, వాహన సౌకర్యాలకు సంబంధించిన పరిశ్రమలలోనూ ఎక్కుడు శ్రద్ధ చూపుతారు. అందువల్ల ఆయాపరిశ్రమలు తొందరగా విస్తరించగలుగుతాయి.

(2) రాజకీయ స్వాతంత్ర్యం పొంది, ఆర్థికంగా ఇతర దేశాలపై ఆధారపడి, అభివృద్ధి దశలో నున్న దేశాలలో పెట్టుబడులపై ప్రభుత్వ నియామకం (Control) అధికంగా ఉంటుంది. ప్రభుత్వం

1. జాన్. డి. మాంట్‌గోమరీ—'విదేశీ సహాయంలో రాజకీయాలు' అన్న పుస్తకంలో.

2. డా. బి. బ్రైట్‌సింగ్—'ఆర్థికాభివృద్ధికై విదేశీ సహాయం' కామర్స్, 7, జనవరి '68 నుండి.

నిర్దేశించిన ప్రణాళికలకు అనుగుణమైన రీతులలో మాత్రమే పెట్టుబడులు అనుమతించబడుతాయి. అనగా, జాతీయ ప్రయోజనాల కవసరమైన క్రమంలో పరిశ్రమలు వృద్ధిచెందుతాయి. ఈ దశలో నియామకాని కెక్కుడు అనుకూలంగా ఉంటాయి కనుక, ప్రభుత్వం విదేశీ ఋణాల రూపంలో పుచ్చుకొన్న మొత్తం, వ్యక్తిగత విదేశీ పెట్టుబడులకన్నా అధికంగా ఉపయోగిస్తుంది.

(3) ఆర్థికంగా కూడా పూర్తిగా స్వతంత్రమైన దేశంలో మూడవదశ ప్రారంభమౌతుంది. పూర్తిగా అమరింపబడిన సౌకర్యాలతో, కఠిన నియామకంలేని స్వతంత్ర విపణి (Free Market) లో పారిశ్రామిక స్పర్థ పెరిగి, నిర్దిష్టమైన వాణిజ్యాభివృద్ధి గోచరిస్తుంది. పెట్టుబడిదారు లీ స్థితిలో ఎక్కుడు లాభదాయకాలైన నిర్మాణ పరిశ్రమల (Manufacturing Industries) వైపు — మొగ్గుచూపి, అంతర్జాతీయ స్థాయిలో లాభాలకై పోటీ పడుతూవుంటారు.

ఏ దశలోనైనా దేశంలో కల విదేశీద్రవ్య పరిమాణాన్ని మూడు రకాలుగా నిర్ధారించుకోవచ్చు.[3] అయితే, ఇందుకు ద్రవ్యోల్బణం ఏమీ జరగలేదని ఊహించుకోవాలి. (ద్రవ్యోల్బణం వర్తమానదేశాలలో ఎట్లా అనివార్యం అవుతుందో ముందు చూపొస్తాము.)

1. మొత్తం ఉపయోగించుకోబడిన (వినిమయమైన) ఉత్పత్తుల విలువ—స్వదేశంలోనే పూర్తిగాబడిన ఉత్పత్తుల విలువ=విదేశీ ద్రవ్య పరిమాణం.

2. మొత్తం పెట్టుబడుల విలువ — మొత్తం నిక్షేపాల (savings) విలువ=విదేశీద్రవ్య పరిమాణం.

3. దిగుమతియైన వస్తు సామగ్రి—ఎగుమతియైన వస్తు సామగ్రి=విదేశీద్రవ్య పరిమాణం.

స్థూలంగా విదేశీద్రవ్యంయొక్క స్వభావం ఇది. ఇక దాని లాభనష్టాలను పరిశీలిద్దాము.

## 4

ఇంతవరకే చెప్పుకొన్నట్లు కేవలం పెట్టుబడి లోటును తీర్చడమే కాకుండా విదేశీ ద్రవ్యం అనేక ఇతర ప్రయోజనాలనుకూడా సాధిస్తుంది. విదేశీ సహాయంలో భాగమైన సాంకేతిక విజ్ఞానం మార్పిడి వర్తమాన దేశాలలో త్వరితంగా వ్యాపించి, భవిష్యత్తుకు పునాదులు వేస్తుంది. విదేశీ పెట్టుబడిదారులు స్వదేశీ పరిశ్రమలకు మార్గదర్శకులుగా ఉండడమే కాకుండా మౌలికమైన ఇనుము ఉక్కు మొదలైన పరిశ్రమలు స్థాపించి ఇతర పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడుతారు. దేశీయ విపణి విస్తరించి, దినదినమూ పెరుగుతున్నఉత్పత్తి ఎగుమతి చేసేందుకు వీలౌతుంది. విదేశీ పెట్టుబడిదారులు తమ లాభాలలోని భాగం తీసివేసుకొన్నా, పన్నుల ద్వారా వర్తమానదేశప్రభుత్వం అందులో వలసినంత భాగం రాబట్టుకొంటుంది. ఉత్పాదనశక్తులు ఎక్కువకావడం వల్ల క్రమంగా ఉత్పత్తులు వినిమయదారులకు తక్కువ ధరలలో లభ్యమౌతాయి. కార్మికులకు వేతనాలు ఎక్కువ మొత్తంలో ముట్టడమేకాక, ఔద్యోగిక అవకాశాలు వృద్ధిచెందుతాయి. సంఘంలో మొత్తంపై జీవనస్థాయి పెరిగి, విస్తరిస్తున్న వివిధ ఉత్పత్తుల కవసరమైన ఆకాంక్ష (Demand)సృష్టింపబడుతుంది. ఈ విధంగా, విదేశీ ఆర్థిక, సాంకేతిక సహాయం బహుముఖమైన అభివృద్ధికి తోడ్పడి, ప్రణాళికాబద్ధమైన ఆర్థిక పురోగతి మరింత వేగవంతంగా సాగేట్లుచేస్తుంది.

మరొకవైపున, విదేశీసహాయం చెప్పుకోదగిన నష్టంకూడా కలిగిస్తున్నదనక తప్పదు. ఇది ఎక్కువ భాగం సహాయం ఉపయోగించుకొంటున్న దేశంయొక్క సామర్థ్యంపై ఆధారపడిఉంది. విదేశీఋణాలను అనుత్పాదకములైన రీతులలో వ్యయపరిస్తే, సంపత్తివృద్ధి ఫలితం కనిపించక ఋణభారం పెరుగుతుంది. అవసరమైనదానికన్నా ఎక్కువ ఋణంచేయడంవల్ల కానీ, పొందిన ఋణాన్ని దీర్ఘకాలంతర్వాత లాభించే పెద్ద పరిశ్రమలలో వ్యవస్థాపించడంవల్ల కానీ, దేశం ఋణగ్రస్తమై పోయ్యే ప్రమాదం ఉంది. ఏటేటా ఋణంపై వడ్డీ చెల్లించేందుకు విదేశీద్రవ్యమారకం కొరకు కటకటలాడుతూ ద్రవ్యోల్బణం అవలంబించవలసి ఉంటుంది. రెండవ పరిస్థితిలో, ద్రవ్యోల్బణం తప్పనిసరి ఆయినప్పటికీ, తాత్కాలికం కనుక—స్వ

---

3. జె. ఎం. మైయర్, 'విదేశీ పెట్టుబడి' అన్నవ్యాసం.

మంగా నిర్వహింపబడినట్లైతే, దీర్ఘకాలప్రాతిపదికపై నష్టంకన్నా లాభమే ఎక్కువ. దేశం అభివృద్ధిం సాధించవలసిన నిర్ణీతకాలంతర్వాతకూడా, ఎగుమతుల విలువకన్నా దిగుమతుల విలువ ఎక్కువగా ఉన్నట్లైతే విదేశీమారకం లభించక దేశం ఆర్థికంగా పతనమైపోతుంది. అనగా ప్రణాళికారచనలో ఏమాత్రం లోపం ఉన్నా, విదేశీ పెట్టుబడులచే అది ద్విగుణీకృతమై మొత్తం ఆర్థికవ్యవస్థనే విఘటితపరుస్తుంది. ద్రవ్యోల్బణం, అధికధరలు పెద్దకాలం ఉండిపోతే ఇట్టి అవ్యవస్థ అంకురించిందని చెప్పవచ్చు.

విదేశీద్రవ్యసహాయం పరోక్షంగా మరికొన్ని ప్రమాదాలకు గురి అవుతుంది. సహాయంచేస్తున్న దేశాలు ఇంతకు పూర్వం చెప్పినట్లుగా రాజకీయ ప్రయోజనాల నాశించి, వర్ధమానదేశాల ఆర్థిక స్వాతంత్ర్యాన్నిగురించి పరోక్షంగా నియంతృత్వం నెఱపవచ్చు. సహాయంచేస్తున్న దేశం, తన సహాయాన్ని కొన్ని పరిమితమైన నిర్మాణాలకు మాత్రమే కుదించి, ఆ మేరకు సహాయం పొందుతున్న దేశంయొక్క ప్రణాళికలు తన కిష్టమైన రీతిలో ఉండేట్లు పరోక్షంగా నిర్దేశించవచ్చు. వర్ధమాన దేశాలు ఒక ప్రత్యేక ధనికదేశంనుండి మాత్రమే తమ కవసరమైన సహాయంలో అత్యధికభాగం పొందుతున్నపుడు, ఈ విధంగా ఆర్థిక నియంతృత్వానికి అవకాశం ఉంది. మరిన్ని, ధనికదేశం కేవలం వ్యాపార దృక్పథంతో వ్యవహరించినట్లైతే, మొత్తం సహాయాన్ని తన స్వార్థప్రయోజనాల కనుగుణమైన రీతిలో చేయవచ్చు. ఉదాహరణకు, తన అవసరానికి మించి పారిశ్రామిక ఉత్పత్తులను కలిగిఉన్న దేశం, ఆ ఉత్పత్తులు అమ్ముడుపోయే విధంగా వర్ధమాన దేశాలకు ఋణసహాయంచేసి విపణిని సృష్టించుకునేందుకు ప్రయత్నించవచ్చు. అనగా, ఋణం స్వీకరించినదేశం, తన కవసరమైన యంత్రసామగ్రిని ఋణదాతయైన దేశంనుండే కొనవలెనని ఒడంబడిక ఉంటుందన్న మాట—లేదా, మొత్తం ఋణమే సామగ్రిరూపంలో ఉండవచ్చు. కేవలం అంతర్జాతీయ ఖ్యాతి నాశించి తక్కువ వడ్డీతో ఋణమిచ్చే దేశం, ఆ నష్టాన్ని తాను ఎగుమతి చేస్తున్న సామగ్రికి విపరీతమైన ధరలు నిర్ణయించడం ద్వారా తీర్చుకోవచ్చు. ఈ విధంగా ధనికదేశంయొక్క దృక్పథం సంకుచితమైన కొద్దీ వర్ధమానదేశంయొక్క ఆర్థిక ప్రగతి దెబ్బ తినడమే కాకుండా, రాజకీయ స్వయం ప్రతిపత్తి కూడా ప్రభావిత మౌతుంది.

నిజానికి, నిస్వార్థమైన సహాయం చేయదలచు కొన్న దేశంకూడా, తా ననుసరిస్తున్న విదేశాంగ విధానంచేతా, తనదేశ ఆర్థిక అవసరాలచేతా ప్రభావితంకాకుండా ఉండలేదు. బలహీనదేశాల రాజకీయ సుస్థిరతకై బాధ్యత కలిగిన దేశాలు చేసే సైనిక సహాయానికి ఆర్థికరంగంలోని సహాయం అనుబంధంగా ఉండే విషయాన్ని చర్చిస్తూ, మాంట్‌గోమరీ ఒక చోట ఇలా అంటారు. 'విదేశీయ వ్యవహారాల్లో జోక్యం కల్పించుకో కూడదన్నది సాంప్రదాయికంగా వస్తున్న నైతికమైన బాధ్యత. అయితే అన్నివేళలా ఇది సాధ్యంకాదు. విదేశీ సహాయ సంబంధాలలో న్యాయమైన, ఆవశ్యకమైన జోక్యాన్ని గురించి మనం ఒక నియమావళిని రూపొందించుకోవాలి. ......రాజకీయ విధానాలకూ, ఆర్థిక విధానాలకూ ముడిపెట్టక, కేవలం ఆర్థిక ప్రాతిపదికపై సహాయాన్ని నిర్ణయించడంద్వారా ఈ జోక్యాన్ని కనీస పరిమాణానికి తగ్గించవచ్చు. అప్పుడైనా, ప్రధానమైన విదేశాంగ విధానానికి వనరులకంగా ఆర్థికవిధానం అభ్యంతరకరమై ఉండకూడదు.'[4]

ఋణదాతయైన దేశం నిజాయితీ కలిగి ఉన్నపుడు మాత్రమే, వర్ధమానదేశాలు నిజమైన ప్రయోజనం పొందగలుగుతాయి. సాధారణంగా ప్రతి దేశమూ, తనకు సాధ్యమైనంత తక్కువ నష్టము, అటు స్వీకర్తృదేశానికి సాధ్యమైనంత ఎక్కువ లాభమూ కలిగే విధంగా ఋణసహాయం చేస్తుంది.

## 5

విదేశీద్రవ్యం, ముఖ్యంగా ఋణసహాయంవల్ల లభించినదానియొక్క పూర్తిప్రయోజనం దాని నుపయోగించుకునే పద్ధతిలో ఉంటుందని అన్నాము. ప్రగతి ప్రణాళిక ప్రారంభ కాలంలో దేశంయొక్క

---

4. జాన్. డి. మాంట్‌గోమరీ— 'విదేశీ సహాయంలో రాజకీయాలు' అన్న పుస్తకంలో ఒక చిన్న చర్చకు సారాంశం.

విదేశీ ద్రవ్యపు ఉపయోగితశక్తి (Absorptive Capacity) పరిమితంగా ఉంటుంది. ఇందుకు కారణం, అప్పుడే దేశంలో అవసరమైన అంతర్వ్యవస్థితి (Infrastructure) పూర్తయి ఉండదు. అనగా రవాణా సౌకర్యాలు ఉండకపోవడం, వ్యాపార దక్షత (Entrepreneurship) వలసినంతగా లేకపోవడం, విపణి స్థానికంగా పరిమితమై ఉండడం, ప్రజలలో ఆకాంక్ష (Demand) మందగతిలో ఉండడం—మొదలైన అసౌకర్యాలన్నమాట. ఈ దశలో విదేశీ పెట్టుబడులకు ప్రోత్సాహం ఉండదు కనుక, ప్రభుత్వం ఋణాలద్వారా సేకరించిన ద్రవ్యాన్ని ఈ వ్యవస్థితిని పటిష్ఠం చేసుకునేందుకు ప్రయత్నించాలి. ఒకసారి ఈ సౌకర్యాలు కనుక కల్పింపబడితే, ఆర్థికవ్యవస్థ యొక్క ఉపయోగితశక్తి పెరిగి పెట్టుబడుల నన్ని వైపులనుండీ ఆకర్షించుకుంటుంది. ఈ లక్ష్యసాధనకై ప్రభుత్వం స్వయంగా మౌలిక పరిశ్రమల స్థాపనకు, ప్రజలలో నిక్షేపశక్తి (Savings Potential) పెంపొందించేందుకు అవసరమైన చర్యలు తీసుకోవాలి. తర్వాతి దశలో ప్రభుత్వ బాధ్యత దేశంలో వృద్ధిచెందుతున్న ద్రవ్యనిధుల (Capital Sources) ను సరియైన మార్గంలో పెట్టే నియామకం మాత్రమే.

ప్రణాళికా లక్ష్యాలు సిద్ధించాలంటే, ఎక్కుడు ఉత్పాదకశక్తి అవసరమైన రంగాలలోకి ముందుగా ద్రవ్యాన్ని మళ్లించడం జరగాలి. ఉదాహరణకు వ్యవసాయం ప్రధానమైన దేశంలో వ్యవసాయోత్పత్తిని పెంచకపోతే, తక్కిన పరిశ్రమలనెన్ని పెంచినా ప్రజలలో వినిమయశక్తి (Consumption ability) లేకపోవడంవల్ల లాభం శూన్యమవుతుంది. పారిశ్రామికోత్పత్తులను నష్టంతో విదేశాలలో విక్రయించి, తిరిగి ఆహార పదార్థాలు అధిక ధరలకు దిగుమతి చేసికొనడంలో, అంతర్జాతీయ వాణిజ్య రంగంలో దేశంయొక్క ప్రతిపత్తి క్రమంగా క్షీణించడం, కొనుగోలు శక్తి తగ్గిపోవడం సంభవిస్తుంది. వ్యవసాయోత్పత్తికి అనుగుణమైన ప్రకృతి సంపద కల దేశంలో, పారిశ్రామిక శక్తులకు ఎక్కుడు ప్రాధాన్యం కల్పించ బూనడం అప్రాకృతికమైనదేకాక నష్టానికి దారితీస్తుంది.

ఉత్పత్తివృద్ధి అయిన పక్షంలో మాత్రమే దేశంలోని సంపత్తియొక్క సరియైన పంపకం (Equitable Distribution of Wealth) జరిగి, జాతీయాదాయంతోపాటువ్యక్తిఆదాయం (Per Capita Income) కూడా పెరిగే అవకాశం ఉంటుంది. 'అధికోత్పత్తి, ఆర్థిక న్యాయం ఒక దానిపై ఒకటి ఆధారపడి ఉంటాయి. ఆర్థిక న్యాయం అమలు జరపకుండా అధికోత్పత్తి సాధింపవచ్చు. కాని, అధికోత్పత్తి లేకుండా ఆర్థిక న్యాయం సాధించలేము. కళ్ల ఎదుటలేని ఉత్పత్తిని ఊహాలోకంలో ఎంత న్యాయంగా విభజించుకున్నప్పటికీ, సామాన్యపౌరునికి ఒరిగే లాభం లేదు'[5]. కనుక విదేశీద్రవ్యసహాయమంతా అత్యధికోత్పాదకమైన మార్గాలలో (Maximum Productive Chanels) ఉపయోగపడితేనే సార్థకమవుతుంది.

కొంత ద్రవ్యాన్ని దీర్ఘకాలిక పరిశ్రమలలో (వ్యవసాయప్రణాళికలలోసహా) నిక్షేపించిన తరువాత ఏతత్ లాభాలను పొందేందుకు మధ్యగల కాలంలో ఆర్థిక రంగంలో వినిమయశక్తి లేక ఆకాంక్ష పెరిగినంత వేగంగా, నిక్షేపకశక్తి (Savings potential) పెరుగదు. అందువల్ల ద్రవ్యాగారంలో ఏర్పడిన లోటును భర్తీచేసుకునేందుకు ప్రభుత్వం తగిన బంగారపు నిల్వలుకాని, విదేశీమారకంకాని లేకయే ద్రవ్యాన్ని ముద్రింపించి ద్రవ్యోల్బణాన్ని సృష్టిస్తుంది—అనగా, సంవత్సర ఆర్థిక నివేదికలో ఆదాయ వ్యయాలకు మధ్యనుగల వ్యత్యాసాన్ని ప్రభుత్వం ఈ కల్పితధనంతో నివారిస్తుంది. (Inflation through deficit financing). తద్ద్వారా ధరలు అధికం కావడం సామాన్యపౌరుని కొనుగోలు శక్తి తగ్గిపోవడం జరుగుతాయి. కాని, కొంతకాలం తర్వాత కలిసివచ్చేలాభాలు ఈ ఫలితాలన్నీ తాత్కాలికమని నిరూపిస్తాయి. ఒకవేళ, అసలు ప్రణాళికలోని లోపంవల్ల, లాభాలులేకపోయినట్లైతే, (లేక—అవసరమైనన్ని లాభాలు పొందలేనట్లైతే), అంతర్జాతీయ వాణిజ్యరంగంలో తప్పనిసరిగా అందుకు బాధ్యతకల దేశం తన ధనం మారకపువిలువ తగ్గించుకోవలసి వస్తుంది. (Devaluation effect.)

మొత్తంపై విదేశీ ద్రవ్యం — ముఖ్యంగా ప్రభుత్వంద్వారా లభించిన ఋణసహాయం లాభదాయ

---

5. చెస్టర్ బౌల్సు — విదేశీ సహాయంపై అభిభాషణ.

కమా, నష్టదాయకమా అన్న విషయం దూర దృష్టితో, సంయమనంతో ఆలోచించవలసిన విషయం. ఏమైనా, విదేశీద్రవ్యం స్వదేశీ పెట్టుబడుల అవసరాలను పూర్తిచేసేట్లు ఉండాలేతప్ప, అసలు స్వదేశంలోని ద్రవ్యంయొక్క ఉపయోగితను నాశనంచేసే అధికారం చెలాయించే పద్ధతిలో ఉండకూడదు[6]. అందుకని ఆయావర్ధమానదేశాల ప్రభుత్వాలు ఋణం లభించే అవకాశంఉన్న చోటల్లా స్వీకరించక, అవసరమైనంత ఋణం మాత్రమే అంచనా వేసుకోవడం అవసరం. మరిన్నీ, ఈ ఋణం ఏ ఒక్క ధనికదేశంతోనూ ముడిపడక, సాధ్యమైనన్ని ఎక్కువ దేశాలనుండి సాధ్యమైనంత తక్కువ మొత్తాలలో స్వీకరించడం ఆశించదగినది. క్రమంగా దేశం స్వయం పోషకత్వం సిద్ధింపచేసుకోగలిగితే తప్ప, ఏ సహాయమూ ప్రయోజనకారికాదు.

ఈ వ్యాసంలో ప్రస్తావించని అంశం మరొకటుంది. కేవలం ధనికదేశాలద్వారానేకాక, అంతర్జాతీయ సంస్థల (ప్రపంచ ద్రవ్యనిధి, వర్ధమానదేశాల సహాయక సంస్థ మొ॥) ద్వారా కూడా ద్రవ్యసహాయం లభిస్తుంది. అయితే, ఈ సహాయంలో ఎక్కువభాగం ప్రత్యేక ప్రణాళికలకై నిర్దేశింపబడి, ఆ ప్రణాళికా నిర్వహణ సహాయంచేసినసంస్థకు సంతృప్తికరంగా ఉండే పక్షంలోనే కొనసాగుతుంది. అనేకవిధాలుగా ఈ విధమైన సహాయం, ప్రత్యేక దేశాల సహాయం కన్నా ఆశంసనీయం.

## అనుబంధం

ఇంతివరకూ సంగ్రహంగా విదేశీద్రవ్యంయొక్క స్వభావాన్నీ, స్వదేశీ ఆర్థికరంగంలో అది వర్తించే తీరునూ పరిశీలించాము. ఇప్పు డావిశ్లేషణ ఆధారంగా మన భారతదేశపరిస్థితి ఎట్లావున్నదో పర్యాలోచించడం వాంఛనీయం. ఇందుకు ఆర్థికశాస్త్రవేత్తల సాంకేతిక సూత్రాల నుపయోగించవలసిన అవసరంలేకుండా సామాన్యదృష్టికి తోచే విధంగానే చూద్దాము.

భారతదేశం ఆర్థికాభివృద్ధికి పంచవర్ష ప్రణాళికాపథం చేపట్టింది. 1950 సం॥ నుండి అట్టి ప్రణాళికలు మూడు గతించి, 1967 ఏప్రిల్‌నుండి నాలుగవ ప్రణాళిక ప్రారంభం కావలసి ఉండగా, ప్రస్తుతం అది వాయిదాపడి, ఒకరకమైన ఆర్థిక జడస్థితి ఏర్పడింది. ప్రథమ ప్రణాళికలో, వ్యవసాయమునకు, రవాణా సౌకర్యాలకు, విద్యుచ్ఛక్తి మొదలైన ప్రాథమికావసరాలకూ, ద్వితీయ తృతీయ ప్రణాళికలలో పారిశ్రామికీకరణమునకు అధికప్రాధాన్యత నిచ్చారు. ఈ విధంగా నిర్వహింపబడిన మూడు ప్రణాళికలలోనూ విదేశీసహాయం స్థూలంగా ఇట్లావుంది:

ప్రథమ ప్రణాళిక 196 కోట్ల రూపాయలు.
ద్వితీయ ప్రణాళిక రూ. 972 కోట్లు.
తృతీయ ప్రణాళిత రూ. 2,650కోట్లు.
చతుర్థప్రణాళిక (అంచనా) రూ. 4000 కోట్లు.

ప్రభుత్వరంగంలో మొత్తం పెట్టుబడిలో విదేశీద్రవ్యం—

ప్రథమ ప్రణాళిక 10%
ద్వితీయ ప్రణాళిక 22%
తృతీయ ప్రణాళిక 28%
చతుర్థప్రణాళిక(అంచవా) 30%

మొత్తం మన ప్రణాళికలలోని పెట్టుబడులలో సుమారు 20% పెట్టుబడిని విదేశాలలో పన్నులు కడుతున్నవారిపై మోపుతున్నాము. 1962 ఆగస్టునాటికే మనకున్న మొత్తం విదేశీసహాయం విలువ సుమారు 4200 కోట్లు—అంతకు పూర్వం దశాబ్దంలోని మొత్తం స్వదేశీనికే పాల (Savings) లో ఇంచుమించు సగభాగం. మూడవప్రణాళికలో(PL 480 కలుపుకుని) విదేశీసహాయం అంతకు పూర్వం రెండు ప్రణాళికలలోని ఋణద్రవ్యంకన్నా సుమారు రెండు రెట్లు. అయితే మొత్తం విదేశీసహాయంలో ఉచితంగా ఇచ్చిన ద్రవ్యం (Grants) ఈ క్రింది శాతంలో ఉంది.

(సుమారు)

ప్రథమ ప్రణాళిక 36%
ద్వితీయ ప్రణాళిక 18%
తృతీయ ప్రణాళిక 5%

---

6. The foreign capital should supplement the domestic capital and should not be a substitute for it with a competitive rather than co-ordinating nature.

క్రమంగా ఉచితద్రవ్యం పాలు తగ్గుతూండడం గమనించవచ్చు.

ఇందుకుగాను మనం తిరిగి చెల్లించవలసిన ద్రవ్యంపై ప్రథమప్రణాళికలో రు. 14 కోట్ల వడ్డీ, ద్వితీయప్రణాళికలో రు. 55 కోట్ల వడ్డీ చెల్లించినాము. తృతీయప్రణాళికలో చెల్లించవలసిన ద్రవ్యం అసలు రు. 313.9 కోట్లుకాక, వడ్డీయే రు. 278.1 కోట్లు. జూలై 31, 1967 నాటికి మనం చెల్లించవలసిన మొత్తం విదేశీద్రవ్యం సుమారు రు. 4005 కోట్లు!

ఇదికాక చెప్పుకోదగిన మొత్తంలో ప్రైవేటు పెట్టుబడులద్వారాకూడా విదేశీద్రవ్యం లభించింది. 1948 సం॥లో విదేశీపెట్టుబడులు సుమారు రు. 255.8 కోట్లుకాగా, 1969 సం.లో ద్విగుణీకృతమై సుమారు 511.12 కోట్లు ఉంది. ప్రథమ దశాబ్దంలోని మొత్తం రు. 10,000 కోట్ల పెట్టుబడిలో రు. 5000 కోట్ల విదేశీపెట్టుబడుల (ప్రైవేటురంగం) నుండి లభించినదే.

మన విదేశీ సహాయంలో సుమారు మూడింట రెండువంతులు అమెరికానుంచీ, వరల్డ్ బ్యాంకునుండీ లభించింది. 1964–'65 మధ్య ఈ విధంగా సహాయం లభించింది.

| దేశం | సహాయం (మిలియన్ల డాలర్లలో) |
|---|---|
| అమెరికా (యు. ఎస్. ఎ) | 1053 |
| వరల్డ్ బ్యాంకు | 590 |
| బ్రిటన్ | 286 |
| పశ్చిమ జర్మనీ | 266 |
| రష్యా | 280 |

ఇంత పెద్ద మొత్తాలలో స్వీకరించిన విదేశీ సహాయం మన అభివృద్ధికి ఎంతవరకు కారక మయ్యిందో అంచనా వేయడం కష్టం. అయినా స్థూలంగా మనం సాధించిన అభివృద్ధి ఈ విధంగా ఉంది.

1951–61 ల మధ్య, 20% జనాభావృద్ధి ఉండగాకూడా జాతీయాదాయం 42%, వ్యక్తి ఆదాయం 17% పెరిగాయి. మొత్తం పెట్టుబడి ద్రవ్యం 1951 లో కన్నా '61 లో మూడురెట్లు పెరిగింది. పారిశ్రామిక ఉత్పత్తి 100% పెరిగింది. ప్రస్తుతం జనాభా 44 కోట్లు. వ్యక్తి ఆదాయం సంవత్సరానికి 69 డాలర్లు, 1981 నాటికి సుమారు 66 కోట్ల జనాభా ఉంటుందనీ వ్యక్తి ఆదాయం 165 డాలర్లకు పెంచాలనీ లక్ష్యం.

దురదృష్టవశాత్తు, ప్రణాళికల మొత్తం ద్రవ్యం పెరిగినకొద్దీ, అభివృద్ధి వేగం తగ్గుతూ వస్తున్నది. మొత్తంపై మన అభివృద్ధి ఈ విధంగా ఉంది:

| | అభివృద్ధి లక్ష్యం | సాధించినది |
|---|---|---|
| ప్రథమ ప్రణాళిక | 11% | 18% |
| ద్వితీయ ,, | 25% | 20% |
| తృతీయ ,, | 34% | 25% |

ఈ మధ్యకాలంలో నిత్యావసర వస్తువుల ధరలు నిరంతరంగా పెరుగుతున్నవి. దేశంలో విదేశీ మారకపు నిల్వలు క్షీణించినవి. గత సంవత్సరమే రూపాయి విలువ తగ్గించబడింది.

ఇంతవరకూ విశిష్టంగా కనుపించిన అంశాలు— రానురాను విదేశీ సహాయం తగ్గవలసిందిపోయి (ప్రభుత్వ రంగంలో) ఎక్కువవుతూండడం, సహాయం ఎక్కువైనా అభివృద్ధి రేటు పడిపోవడం, పారిశ్రామిక ఉత్పత్తులు పెరిగినా ఎగుమతులు వలసినంతగా పెరుగకపోవడం, ఆహారపదార్థాలకొరకై విదేశాలపై ఎక్కువగా ఆధారపడవలసి రావడం, మొ.

పైన సాధ్యమైనంతవరకు నా వ్యాఖ్యానాలు జోడించకుండా, స్థూలమైన సమాచారం మాత్రమే అందించినాను. పాఠకులు పై ఆధారాలతో దేశాభివృద్ధినిగూర్చి తమంత తామే నిర్ణయాలకు రావచ్చు.

---

# సూర్యుణ్ణి ప్రేమించాను

శ్రీ వరవరరావు

సూర్యుణ్ణి ప్రేమించడమేమిటి, వెర్రిగాకపోతే...
దగ్ధమయిపోవాలని లేకపోతే...

ఉదయమే ఆకుపచ్చ చెట్లలోని ఆనందం చూసి
తూర్పు దిక్కు, ఆకాశం మొహం చూసి
సృష్టిలో ఎవరో పిల్చినట్లు మేల్కొనే చైతన్యం చూసి
రాత్రికీ, ఈ ఉదయానికీ ఉన్న వ్యత్యాసాన్ని
కంటిలోని కాంతి కిరణంతో కొలిచి
సూర్యుణ్ణి కోరుకున్నాను.
చూడడు.
చూసినా ఆకునో, పిట్టనో, పువ్వునో
అడవినో, గుట్టనో, పృథ్వినో చూసినట్లు ...
ఆ చూపే నాకు జీవాన్నీ ఆవేదనూ
ఆ రూపే నాకు భావాన్నీ, అనుభూతినీ
ఇస్తున్నాయని తెలుసుకొనేంత
ఇంగితం లేని ఇనుడు.

నాకు సూర్యుడు కావాలని కాదు
నా చల్లబడిపోయిన రక్తంలో
అతను ఉదయించలేడు.
నా చెల్లబడిపోయిన శక్తిలో
అతను పయనించలేడు.

నా నరాలూ, ఎముకలూ
ఎప్పుడూ ఆ వేడిని ఆచుకోగలమని కానీ
కాచుకోగలమని కానీ మూల్గలేదు
కాని నా చూపుల కావేడి తాకాలి.

అప్పుడుగానీ నా గుండెలు కొలిమి తిత్తులై
పదునైన భావాల కత్తులు తయారుకావు.

కొన్నాళ్ళుగా ఊహల్ని వెలిగిస్తున్నది సూర్యుడు
కొన్నాళ్ళుగా నా కలల్లోకి వస్తున్నది సూర్యుడు
హృదయమా, నీకు చురుక్కుమని తాకిన
ఈ వేడి, ఇన్నాళ్ళా నీలోదాగిన అగ్నిదే.

నన్ను చూసినపుడు సూర్యుడు చల్లగానే చూస్తాడు ?
కాని ఆ చూపు గుండెలోకి దిగివా కొద్దీ
అరణ్య కీలలా రగులుకొంటుంది.
సూర్యుడు మెల్లగానే నడచిపోతాడు
కాని ఒక్కసారే అతడు ఆకాశంలోంచి
నా అంతస్సులోకి గంతువేసినట్లు
నా వొళ్ళు జల్లుమంటుంది.

అతడు చూడగా నాలో పూసిన ఊహలన్నీ అల్లి
ప్రేమమాల కట్టాను.
అతడు వెళ్ళిపోయే వేళకు
మనసు వేడి పొయ్యి లాగుంటుంది.



# దిఙ్నాగనామ్

## శ్రీ కట్టి సాంబమూర్తి శాస్త్రి

శ్రీమంతుడు కాళిదాసుడు తన మేఘసందేశ కావ్యమున మొదటిసర్గమున మేఘు నుద్దేశించి క్రింది విధముగ—

అద్రేశ్శృంగం హరతి పవనః
కింస్విదిత్యున్ముఖీభి
ర్దృష్టోత్సాహ శ్చకితచకితం
ముగ్ధసిద్ధాంగనాభిః
స్థానా దస్మా త్సరసనిచుళా
దుత్పతోదఙ్ముఖః ఖం
దిఙ్నాగానాం పథి పరిహరన్
స్థూలహస్తావలేపాన్. స. 1 శ్లో. 14.

రచించినాడు. మల్లినాథసూరి దానిని వ్యాఖ్యానించుచు:

"అత్రేద మన్యర్థాంతరం ధ్వనయతి రసికో నిచుళోనామ మహాకవిః కాళిదాసస్య సహాధ్యాయీ పరాపాదితానాం కాళిదాసప్రబంధ దూషితానామ్ పరిహర్తా యస్మిన్స్థానే తస్మాత్స్థలా దున్ముఖో నిర్దోషత్వా దున్నతముఖః సన్ పథి సారస్వతమార్గే దిఙ్నాగానాం, పూజాయాం బహువచనం, దిఙ్నాగాచార్యస్య కాళిదాసప్రతిపక్షస్య హస్తావలేపా న్హస్త విన్యాస పూర్వకాని దూషణాని పరిహరన్ | అవలేపస్తు "గర్వేప్యాలేపనే దూషణేఽపిచ" ఇతి విశ్వః | అద్రేరద్రికల్పస్య దిఙ్నాగాచార్యస్య శృంగం ప్రధానమ్ "శృంగం ప్రాధాన్య సాన్వోశ్చ" ఇత్యమరః | హరతి కింస్విదితి హేతునా సిద్ధైః సారస్వతసిద్ధై ర్మహాకవిభి, రంగనాభిశ్చ దృష్టోత్సాహః స త్వముత్పతోచ్చై ర్భవేతి స్వప్రబంధమాత్మానంవా ప్రతికవేరుక్తి రితి. సంసర్గతో దోషగుణాభవంతీ త్యేతన్మృషాయేన జలాశయోఽపి. స్థిత్వానుకూలం నిచుళశ్చలంతమాత్మానమ్ రక్షతి. "సింధువేగాత్" ఇత్యేతచ్ఛ్లోక నిర్మాణాత్తస్య కవే ర్నిచుళసంజ్ఞేత్యాహుః"

అని ఒక వింతయైన వ్యంగ్యార్థమును ప్రకటించినాడు. పై గ్రంథమున కర్థమేమనగా కాళిదాసు సహాధ్యాయుడగు నిచుళుడను నొక కవి కాళిదాసునం దత్యంత పక్షపాతముగలవాడై యితర కవులు కాళిదాస కవితయెడజేసిన దుర్విమర్శములను ఖండించుచు కాళిదాసునకు గుణోత్కర్షము గూర్చువాడనియు, దిఙ్నాగుడను కవి కాళిదాసునెడ నసహిష్ణుడై యాతని కావ్యములం దసమర్థములగు వాక్షేపములాపాదించుచు నిచుళుని నిందలకు పాలగుచుండువాడనియు యా వ్యంగార్థ స్వరూపము. ఈ నిచుళు డెవడు? దిఙ్నాగు డొక్కడా? పెక్కురు దిఙ్నాగులా? వారెక్కడివారు? వారికి కాళిదాసునకును సంబంధమెట్లు కలిగెడిది? యను విషయము లాలోచింపవలసి యున్నది. కాళిదాసుడు విక్రమాదిత్యుని సభాస్తారుడుగ నుండువాడనుట సర్వవిదితము.

ధన్వంతరి క్షపణ కామరసింహ బాణ|
భేతాళభట్ట ఘటకర్పర కాళిదాసాః|
ఖ్యాతో వరాహమిహిరో నృపతే స్సభాయాం|
రత్నానివై వరరుచి ర్నవ విక్రమస్య||

అను ప్రాచీన చాటుపద్యము సుప్రసిద్ధము. కాని పై చాటువునం దీనిచుళుడుగాని దిఙ్నాగుడుగాని కానరారు. అందున్న క్షపణక, ఘటకర్పర, భేతాళభట్టు నామములంతగా దెలియరానివి. పాశ్చాత్య చరిత్రకారులు దిఙ్నాగుని దండిని హరిషేణుని ఇంకను మఱికొందఱు కవులనుగూడ విక్రమార్కుని సభాస్తారులుగా బేర్కొన్నారు. నవరత్నము లేకాదశ రుద్రులు ద్వాదశాదిత్యులుగాను నవతరించుచున్న ంతా

చిక్కు సమస్యను విడదీయుటెంతయు నవసరమై యున్నది. నవరత్నాలంకృతసభాంగణమున గొలువు దీర్చెడు విక్రమాదిత్యుడెవ్వడు? అత డేకాలమువాడో కూడ తెలిసికొనవలసి యున్నది.

విక్రమాదిత్యుడను పదము చిన్నవాడు తలిదండ్రులు చేసిన నామకరణముగాదు. పెరిగి పెద్దవాడై విద్యాబుద్ధులు గడించి యనన్య సాధారణమగు బుద్ధిబాహుబలములచే శత్రువుల నుక్కడించి మహాసామ్రాజ్యము ప్రతిష్ఠించుటచే ప్రజలు పెట్టిన పేరు. బిరుదనామము. మగధదేశము పాలించుచు భారతదేశమం దధికభాగ మాక్రమించిన గుప్తచక్రవర్తులలో నొక్కని కీబిరుదము గలదు. గుప్తసామ్రాట్టులలో ప్రథమ చంద్రగుప్తుడు, సముద్రగుప్తుడు, ద్వితీయ చంద్రగుప్తుడును కడుప్రసిద్ధులు. వీరిలో నొక్కని కాబిరుదము గలదు. ఆ బిరుదముగలవాడెవ్వడను విషయమున చరిత్రకారులు కొందఱు ప్రథమ చంద్రగుప్తున కనియు, మఱికొందరు సముద్రగుప్తున కనియు మఱికొందఱు ద్వితీయ చంద్రగుప్తుని కనియు వేఱువేఱురీతుల బేర్కొనుచున్నారు.

క్రీస్తునకు పూర్వము మౌర్యసామ్రాజ్యము స్థాపించిన చంద్రగుప్తచక్రవర్తి యొకడుకలడు. కాని యాతని కీబిరుద సంబంధములేదు. కవులతో సంబంధ మంతకంటెనులేదు. చాణక్యుని సాయమున నంద వంశమును నిర్మూలించి మౌర్యసామ్రాజ్యము నెలకొల్పిన వా డాతడు. ఈ విక్రమాదిత్యుడు గుప్తసామ్రాజ్యము స్థాపించిన గుప్తవంశములోనివాడు. గుప్తవంశము, సామ్రాజ్యము క్రీస్తు తరువాత వెలసినవి. సముద్రగుప్తుని అలహాబాదు శాసనమున గుప్తవంశక్రమము గలదు. "మహారాజశ్రీ ఘటోత్కచ పౌత్రస్య, మహారాజాధిరాజశ్రీ చంద్రగుప్తపుత్రస్య, లిచ్ఛవి దౌహిత్రస్య, మహాదేవ్యాం కుమారదేవ్యా ముత్పన్నస్య, మహారాజాధిరాజశ్రీ సముద్రగుప్తస్య" అను ముగ్గురు రాజులు తెలుపబడిరి. వీరిలో ఘటోత్కచుడు మహారాజు మాత్రమే; ప్రథమచంద్రగుప్తుడు సముద్రగుప్తుడును మహారాజాధిరాజులుగా బేర్కొనబడిరి. అందును నీ శాసనము సముద్రగుప్తుని విద్యాపరాక్రమముల బ్రకటించుటకే పుట్టినదగుటచే సముద్రగుప్తునే విశేషముగా వర్ణించుచున్నది. రెండవ చంద్రగుప్తుని కాలమున నెలకొల్పబడినదైనను నాతని ప్రసక్తియైనం దేమాత్రమును లేదు. కనీసము రెండవ చంద్రగుప్తుని పేరైన నిందులేదు. మొదటి చంద్రగుప్తుడు పరాక్రమశాలియయినను గావచ్చును. కాని యాతడు దిగ్విజయాదికార్యము లొనర్చిన ట్లగపడదు. కవియనికాని పండితుడనికాని వర్ణింపబడలేదు. ఆ కారణములనుబట్టి చంద్రగుప్తులిరువురును విక్రమాదిత్యబిరుదాంచితులు కారనియు నవరత్నప్రఖ్యాతి నందిన కవుల కాశ్రయములుగారనియును జెప్పుట కాటంకములేదు. సముద్రగుప్తుడన్నచో దిగ్విజయ మొనర్చినాడు. మహాబలపరాక్రమశాలి. సంగీత సాహిత్యములందును కవితావిరచనమునందును ప్రతిభావంతుడు, సకలశాస్త్ర తత్త్వనిష్ణాతుడు, సకల సద్గుణమణివారాశి యని శాసనము చాటుచున్నది. "పరాక్రమాంకస్య" యని కంఠోక్తిగా ఘోషించుచున్నది. వేయేల లోకరక్షణమునకై యిల నవతరించిన లోకధాముడని పేర్కొను చున్నది. కాబట్టి తాతను మనమని విడచి సముద్రగుప్తునే విక్రమాదిత్య బిరుద మలంకరించినదని నిస్సందేహముగా జెప్పవచ్చును. (పాశ్చాత్య చరిత్రకారు లీతనిని ఇండియన్ నెపోలియన్ అని శ్లాఘించిరి.) ఈతని యాస్థానమే కవిరత్నాలంకృత మనియు నిస్సంశయముగా నమ్మవచ్చును. ప్రసక్తానుప్రసక్తమగు నీ విషయము విడచి ప్రకృతమనుసరింతము.

చారిత్రకులు దిఙ్నాగుని దండిని హరిషేణునిగూడ విక్రమాదిత్య సభాస్తారులుగా బేర్కొన్నారు. దిఙ్నాగులు, 'కుందమాలా' నాటకము రచించిన యాత డొకడు, పల్లవ చక్రవర్తి మహేంద్రవర్మ కాలమున నుండిన జైనాచార్యు డొకడు నగపడుచున్నారు. తొమ్మిదవ శతాబ్దమున దశకుమారచరిత్రము కావ్యానుశాసనము రచించిన దండి దాక్షిణాత్యుడు. విక్రమాదిత్య సభా సభ్యుడగు దండి గ్రంథము లేవియో తెలియవు. కాదంబరి, హర్షచరితము రచించిన వరి వంధి కవికుల హృదయ శాలుడగు బాణమహాకవి సుప్రసిద్ధుడు. విక్రమాదిత్యుని బాణుని కవిత యేదియు ప్రసిద్ధము గాలేదు.

ఘటకర్పర, క్షపణక, భేతాళభట్టుల కావ్యము

లేవియో! ఘటకర్పర కావ్యమొకటి కలదని ప్రతీతి. ధన్వంతరి క్షీరసాగరమథనమున బొడమూపి సురుల కమృతకలశ మర్పించిన యాతడు విష్ణునంశభేదము. దేవుడు.

"నమామి ధన్వంతరి మాదిదైవ్యం।
సురాసురైర్వందితపాదపద్మం।
లోకే జరారుగ్భయ మృత్యునాశం।
దాతార మీశం వివిధౌషధానామ్॥"

అని ప్రస్తుతింపబడినాడు. ఈతడు వైద్య విఘంటుకర్త ధన్వంతరియగును. వరాహమిహిరుడు జ్యోతిశ్శాస్త్రకర్త. వరరుచి వ్యాకరణశాస్త్రకర్త. చాటు శ్లోకమున నిచుళ, దిఙ్నాగ, హరిషేణనామము లగపడవు. కాని చారిత్రకులు వారిని బేర్కొను చున్నారు. బహుశః నిచుళ, దిఙ్నాగశబ్దములు బిరుదవాచకములై యుండునని తోచుచున్నది. హరి షేణుడు సుప్రసిద్ధుడు. అలహాబాదు శాసనకావ్యకర్త.

కాళిదాసుని మేఘదూతశ్లోకమునకు మల్లి నాథుని వ్యాఖ్య ననుసరించి "సంసర్గజా దోష గుణా భవంతీ"త్యాది శ్లోకరచనముచే నిచుళ బిరుదము కలిగిన దనుట విదితమేకదా! దిఙ్నాగపదముగూడ బిరుదమే యగును. మన శ్రీ కృష్ణదేవరాయల యాస్థానమున అష్టదిగ్గజములని ప్రసిద్ధిగన్న కవులు గలరుగదా! అట్లే విక్రమాదిత్యుని సభ యందును దిగ్గజ బిరుదాంచిత కవు లెనమండ్రుండి యుందురు. కాళిదాసుని గలుపుకొని నవరత్న ప్రసిద్ధి నందిరి. తాను వినాగా నా యెనమండ్రు కవుల నుద్దేశించియే కాళిదాసుడు వ్యంగ్యముగా రచించి నాడు. కావుననే బహువచనము ప్రయోగించినాడు. పూజాయాంబహువచన మని వ్యాఖ్యానము సరికాదు. నిందాపూజాద్వయ మేకకాలమున సంభవింపదుగదా? కాళిదాసుడు విక్రమాదిత్యుని కాలము వాడైనను నాతని యాస్థానకవి కాడేమోయని సముద్రగుప్తుని శాసనము విమర్శించినచో సంశయము కలుగు చున్నది. శాసనము ఆరవపంక్తి మూడవ శ్లోకము నందును, వెనిమిదవ శ్లోకమునను సముద్రగుప్తుని కవితా ప్రాభవము పేర్కొనబడినది. 'తత్కావ్య శ్రీ విరోధా న్బుధ గుణిత గుణాజ్ఞాహతానేవకృత్వా' 'కవి మతివిభవోత్సారణం చాపి కావ్యం' అను వాక్యములు కాళిదాసు నుద్దేశించినవే యగును. అట్లయినచో కవికులగురువగు కాళిదాసునకు వాత నికి కవితావిషయమున విరోధమున్నదనుట తెల్ల మగును. ఇట్లయినచో దిఙ్నాగానాం అని గౌరవాభాస ముగా సూచింపబడిన వాడొక్క సముద్రగుప్తుడే యగును. బాహుబలముచే కొందఱ రాజుల జయించిన బలశాలి వహోవైభవముచే సర్వంసహాచక్రము నాచంద్రార్కము నేలెడి కవిరాజు కడ నేపాటివాడు? మఱియొక విషయముకూడ చూడవలసియున్నది. సముద్రగుప్తుని ప్రశస్తియంతయు నల్హాబాదు శాస నమువలన మాత్రము తెలియుచున్నది గాని సముద్ర గుప్తుడు రచించిన కృతులుగాని అధమమొక చాటు పద్యముగాని కానరాదు. అవి యేవైన దొరికిన నతని కవితాకీర్తి రాజ్యభోగము దెలిసియుండును. అ ట్లేయాధారములేదు. ఆ శాసన కావ్యరచయిత హరి షేణుడు తరములనుండి రాజదాస్యము నెఱపెడి వంగడమున జనించినవాడు. తానును రాజదాసుడే.

"ఏతచ్చ కావ్య మేషామేవ భట్టారక పాదానాం దాసస్య సమీపపరిసర్పణానుగ్రహోన్మీలితమతేః ఖాద్యటపాకికస్య మహాదండనాయక ధ్రువభూతి పుత్రస్య సాంధివిగ్రహిక కుమారామాత్య మహాదండ నాయక హరిషేణస్య సర్వభూత సుఖాయాస్తు" అను వచనమునుబట్టి హరిషేణుని యుదంత మూహింప నగును. ఈతడే సముద్రగుప్తునకును వైమనస్యము గల్పించి కాళిదాసునకు రాజాస్థానమునకు దూరము పుట్టించి

"లోకే ఖల భుజంగస్య
విచిత్రోఽయం వధక్రమః
అన్యస్య దశతి శ్రోత్ర
మన్యః ప్రాణైర్వియుజ్యతే."

అను లోకోక్తికి బాత్రమై యుండును. అదియే సరి యైనయెడల కాళిదాసునిచే నిందింపబడిన దిఙ్నాగు డీతడేయగును. శాసనము శిథిలమగుటచే నితర కవితా రీతి సరిగా దెలియకున్నది. కాని కాళిదాసుని ధిక్క రించునంతటిది మాత్రముగాదు. శ్లోకభాగము ప్రౌఢ మైనదేయైనను గద్యము మాత్రము ప్రశంసింపదగి

సది గాదు. చెప్పినదే చెప్పుట, చెప్పిన విషయము ఒక క్రమము ననుసరింపకుండుట కనబడుచున్నవి. కళింగమును దక్షిణాపథమున జేర్చినాడు. 'కౌష్టపురక మహేంద్రగిరి కౌట్టూరకస్వామి దత్తైరండ పల్లక దమన కాంచేయక విష్ణుగోప అవముక్తక నీలరాజ వైఙ్గేయక హస్తివర్మ పాలక్క కోగ్రసేన దైవరాష్ట్రక కుబేర కౌస్థలపురక ధనంజయ ప్రభృతి' అని పదుమూడు క కారములను జెక్కినాడు. వీనిలో పెక్కుపురముల పేర్లె కనివిని యెఱుగనివి. ఒక్క వైంగేయక హస్తివర్మ పేరు దక్క దక్కిన రాజుల నామము లశ్రుతచరములు. ఈ రాజులు బహుశః చిన్న చిన్న జమీందారులగుదురేగాని రాజ్యాధిపతులై యుండరు. షాహి షాహానుషాహీత్యాది నామములును వింతలే! హరిషేణుని బుద్ధిలో సముద్రగుప్తుడు సప్తద్వీప వసుంధరాధిపతి. ఇంతియకాక భూమిని నుద్ధరించుటకు భూమి నవతరించిన 'లోకధాముడు'. 'అష్టభిర్లోక పాలానాం మాత్రాభిర్నిర్మితో నృపః' అను పురాణ వచనము పౌరాణిక రాజులందే కనబడుచున్నది. కాని పదునేడు శతాబ్దముల వాడున్న యాతనియెడ నంత సముచితముగాదు. సమంజసమేయన్న నది యత్యుక్త్యలంకారమున కుదాహరణమే. కళింగము నేలిన చేదివంశపురాజు ఖారవేలుడు తా వేయే వయస్సున వేయే కార్యము లొనర్చినదియు వేయేరాజుల జయించినదియు స్పష్టముగా బేర్కొన్నాడు. అతని శాసన మీ శాసన కారునకు తెలిసియుండదు. ఆ శాసనము తత్త్వ కథనమనియు నీశాసనము కేవల మతిశయోక్తియనియు పాఠకులకు సుగమమే యగును.

ఏతావతా తేలిన దేమన బహుసంఖ్యాకులగుటచే బహువచననిర్దిష్టులగు విక్రమాదిత్యాస్థాన పండితులుకాని ఏకవ్యక్తియైనను బహువచనముచే గౌరవింపబడిన సముద్రగుప్తుడుగాని కాళిదాసునిచే వ్యంగ్యమర్యాదచే నిరసింపబడిన దిఙ్నాగులుకారనియు ఖాద్యటపాకికుడు (మహానసమున వంటలను నియమించువాడు) అగు నీ హరిషేణుడేయని నిశ్శంకముగా జెప్పవచ్చును. హరిషేణు శాసనమున సముద్రగుప్తుని విశేషించిన అంశములనే కాళిదాసుడు రఘువంశ తృతీయ చతుర్థ సర్గములందు విశదముగా మనోహరముగా వర్ణించియున్నాడు. ఆ విషయము లిక్కడ బేర్కొనుట గ్రంథవిస్తరహేతువగునని విరమించితిని. ఆ విషయము పాఠకులే స్వయముగ విమర్శింపగలరు. చెప్పినదేచెప్పి విస్తారముగా వర్ణింపబడిన సముద్రగుప్తుని వదాన్యతను కాళిదాసుడు రఘువంశము నాలవసర్గము చివర

శ్లో. స విశ్వజిత మాజహ్రే
యజ్ఞం సర్వస్వ దక్షిణమ్
ఆదానం హి విసర్గాయ
సతాం వారిముచా మివ॥

అను నొక్క శ్లోకముతో మనోహరముగా వ్యాఖ్యాణించినాడు.

---



# సహృదయులు - రసానందం

శ్రీ "అర్జున"

భారతదేశములోని కళలన్నీ రసాత్మకమై—వివిధ రస పోషణలలోను విగూఢమైన ఆత్మసౌందర్యముతో అలరారుచున్నవి. అట్టి రసపోషణ మార్గాలలోనే భారతీయ కళాసంపదను మెరుగుపరుస్తూ నిత్యచైతన్యానందాన్ని సహృదయులకు అందిస్తూ భారతీయ కళాకారులు పురోగమిస్తున్నారు. యుగయుగాలనాటి కళాసంపదలను బయటకు లాగి వాటిలోని ఆత్మసౌందర్యాన్ని పోషిస్తూ నేటివరకు కళలను ఆరాధిస్తున్నారు. ఈ అఖండకళాసృష్టికి వెనకాల దాగిన రసతత్వము ఆధ్యాత్మికములోని భావపురవ్వలు. భారత కళాసంపద అంతా ఆధ్యాత్మికమై ఆనందంగాను, బ్రహ్మానందముగానూ రసానందాన్ని అందిస్తున్నది. కళాకారులు ఈ భావపురవ్వలను తీర్చిదిద్దుతూ దాని ఆత్మను బ్రహ్మానందములో రంగరిస్తూ నిత్యానందమైన రసానందాన్ని సహృదయులకు పంచిపెడుతున్నారు. అంతా ఆనందమయం. జగమంతా బ్రహ్మానందమయం, జగత్తే రసమయం, అని మొట్టమొదటిసారిగా భారత కళాసంపద ఆధ్యాత్మికమై నిలచింది.

మన చర్యలలోనూ, భావాలలోను, బ్రతికే తీరులలోను, జనన మరణావస్థలయందునూ, భవసంఘర్షణలోనూ, ఆధ్యాత్మికమే రసోత్పత్తికి కారణమవుతూ బ్రహ్మానందము అవతరిస్తున్నది. ఇది భారతీయ కళాకారుల కళాసంపదకు హేతువై నేటికి అదే భావాలను స్ఫురింపజేస్తున్నది. కళాకారులకు కలిగిన ఈ భావోదయము ఇదే మార్గాల్లో పయనిస్తూ నేటి ప్రజాస్వామ్యపు యుగాలవరకు గట్టి పునాదులలో పెరిగి ఆధ్యాత్మికపుభావాలవైపు మొగ్గవేస్తున్నది. సహృదయుడు ఈ ఆనందాన్ని తనివిదీరా అనుభవిస్తూ—ఖావరాలవరకూ దాచుకొని ఆనందిస్తున్నాడు. పునర్జన్మల ప్రతిపాదనలో ఈ ఆనందాన్ని మరో జన్మలోకూడా అనుభవించాలని ఉత్సాహపడుతూ ప్రస్తుతపు జన్మను రసమయం చేసికొని నిత్యానందుడై - జనన మరణాలకు అతీతుడై—పరిశీలకులకు రసద్రష్టగా ప్రత్యక్షమవుతున్నాడు. సహృదయులు ఈ వ్యవస్థను బ్రహ్మానందంగా పరిగణించారు. రసస్థాయిని బ్రహ్మానందంవరకు పొడిగించి సహృదయులను సమ్మోహపరచారు. ఇలా రసజగత్తులో సమ్మోహపరుస్తూ నిత్యానందంలో చైతన్యపరులుగా చేయుటమే కళాకారుల సృష్టి అని విశ్వసించేటట్లు రసజగత్తును నిర్మించారు.

ఈ ఆధ్యాత్మికపు రస జగత్తులో 'బ్రహ్మానందమే' స్థాయీభావమై ప్రతి భారతీయ కళాకారుడిలో ప్రభావితమవుతూ సుదీర్ఘ రసపథంలో సహృదయులే రసద్రష్టలవుతూ, రసద్రష్టలే సామాజికులవుతూ, ఒండొరులు, బ్రహ్మానందపు రసానందాన్ని ఆస్వాదించుకొంటూ ఆత్మస్వరూపాలకు వినయులై సురక్షితంగా రోజులు గడిపారు. వ్యావహారికలోకములో రాగద్వేషాలను కూడ ఈ రసాస్వాదనలో జీర్ణించుకొని—కళలే బ్రహ్మానందమనే స్థాయిలోకి వచ్చారు.

కళాకారుడికి ఓ గట్టి సమస్య ఎదురుపడింది. ఈ బ్రహ్మానందం వ్యావహారిక లోకములో సాధ్యమా? అనే సందేహములో పడ్డారు. కష్ట నిష్ఠూరాలకు ఓర్చుకుంటూ రస సృష్టికి ఉపక్రమించి కొంత సాధించాడు. కాని అతని సాధన ఆ స్థాయీ భావాన్ని కలిగించలేకపోయింది. రాను రాను సహృదయుల రంజింప చేయుటానికి పలువిధాలైన ప్రక్రియలను సృష్టించాడు. అయినా బ్రహ్మానందం అనుభవించలేకపోతున్నామని సహృదయులు అసంతృప్తి తెలియపరుస్తూనే వచ్చారు.

కాలగర్భములో రసపోషణక్రమము విభిన్న మార్గాలలో పయనిస్తూ ఆధ్యాత్మికపు బ్రహ్మానందాన్ని సూచిస్తూనే ఉంది. పద్ధతులు మారినవి కాని లక్ష్యము మారలేదు.

వివిధదేశాల కళాసంపదను పరిశీలించినపుడు భారతీయ కళాకారుడికి ఆధ్యాత్మికపు రసానందమే బ్రహ్మానందమై అతని మనసును రంజింపజేస్తున్నది.

నేటి భారతీయ కళాకారుడు—వివిధదేశాల రసపోషణ ప్రతిభను అవగాహనచేసికొని ఆధ్యాత్మికపు రసస్థాయీభావాలలో రసానందాన్ని ఆస్వాదించుకుంటున్నాడు. రసపోషణక్రమము, ఆధ్యాత్మికపు సిద్ధాంతాలవల్లనే సాధ్యమని విశ్వసిస్తున్నాడు. ఈతని ఈ విశ్వాసమే ఇతర విశ్వకళాకారుల నుండి ఇతనిని వేరుపరుస్తున్నది. స్థాయీ భావాలకు ఆధ్యాత్మికపు సిద్ధాంతాలు ఉపయోగించవని కొందరు ఇతరములైన సిద్ధాంతాల ఆధారములో రససృష్టి కావిస్తున్నారు. ఇలా విభిన్న సిద్ధాంతాల మార్గాలలో సృష్టింపబడుతున్న కళాసంపద ఒక్కొక్కమార్గములో ఒక్కొక్క భావరత్నమై, ఒక్కొక్కభావము సంఘర్షించుకుంటూ భావ సంఘర్షణలు రసావతారమై తిరిగి బ్రహ్మానందపు స్థాయీ భావములలో రసానందాన్ని అందిస్తున్నది.

జగమంతా బ్రహ్మానందమయం అనే భారతీయ కళాహృదయం—తిరిగి ఆధ్యాత్మికములోనే లీనమవుతూ, బ్రహ్మానంద సృష్టికి విశ్వములో మూలకారణ మవుతుంది. ఇప్పుడది ఒకేభావములోగాని, ఒకేచర్యలోగాని, భారతీయ కళాకారులకు, దుస్సాధ్యమవుతూ సామాజికులకు ఒక ఆశగా, జీవితధ్యేయంగా భాసిస్తూ అందనివండువలె హోరూరిస్తున్నది: పలుసిద్ధాంతాలు రసపోషణభారాన్ని వహించి—సామాజికులకు పలువిధాలుగా రసానందాన్ని అందిస్తున్నవి. అయితే భారతీయ సామాజికులు ఈ ఆనందాన్ని తిరస్కరిస్తూ అనాటి రసవాదాన్ని ప్రస్తావిస్తూ నేటిది రసానందం కాదని మానసికమైనదని అంటున్నారు. అయినప్పటికి కళాకారుడు ఆత్మవిశ్వాసాన్ని కోల్పోలేదు.

పురోగతిలో మానవుడు అవలంబించవలసిన పద్ధతి ఆధ్యాత్మికమని కొందరు భావిస్తారు. భౌతిక పద్ధతే సరియైనమార్గమని కొందరు భావిస్తారు. ఈ రెండు పద్ధతులు సరియైనవి కావని మరి కొందరు భావిస్తున్నారు. నేటి పురోగతిలో ఈ వాదాలు ప్రబలిపోతూ, సామాన్యమానవుని స్థిరత్వాన్ని చెరుపుతూవుంటే అప్పుడప్పుడు పిడివాదాలకు దిగి వారివారి పద్ధతులనే సమర్థించుకుంటున్నారు. కళాకారుడు ఈ చిక్కును విడదీస్తూ లక్ష్యసాధనకు మార్గాలేవో సూచిస్తూ స్థిరమైశరిని ప్రదర్శిస్తున్నాడు.

సాహిత్యజగత్తులో కళాకారుడు 'మహాభారతము' కావ్యములో ఈ చిక్కును కొంతవరకు విడదీస్తూ మార్గాలను సూచించాడు. ఈ మార్గాలను పరిశీలించినప్పుడు ఆదర్శప్రియులు—వారు తలంచే మార్గాల కెల్ల ఆనందమైన మార్గం అదొకటే అని అంగీకరించారు. ఈ విధంగా సూచించిన మార్గాలలో కూడా మరికొందరూ మరికొన్ని సూచించారు. పలువురు సూచించిన ఈ మార్గాలే విశ్వసాహిత్యములో చోటు చేసుకున్నాయి. ఈ మార్గాలే నిత్యజీవితములో కోకొల్లలుగా అనుభవవేద్యమవుతున్నాయి. విశ్వసాహిత్యములో సూచించిన మార్గాలను అవలంబించినపుడు కళాకారుడు చైతన్య ప్రభావితుడవుతున్నాడు. ఈ మార్గాలను అనుకరిస్తూ తన్మయత్వములో పడి ఆనందమని, మానసికానందమని, బ్రహ్మానందమని తనకుతాను సమాధానపడుతూ రంజితుడవుతున్నాడు. ఒకవిధంగా రసద్రష్టలు ధన్యులే!

మహాభారతము వ్రాసిన కవి తిక్కనకు కవిబ్రహ్మ అని బిరుదునిచ్చి, కళాకారులు తమ గౌరవాన్ని ప్రదర్శించారు. కళాసృష్టిలో కవిబ్రహ్మనే అనుసరించటము సాధ్యమా? వారి మేధాశక్తిని హర్షించి, మార్గాలు ఎన్నుకొని గౌరవము చూపవలసిందేకాని పోకడలను అనుసరించరాదు. అనుకరించినపుడు ఆదర్శము పరిమితమై మళ్లీ భారతయుగానికే తిరిగి వెళ్లవలసివస్తుంది. అనగా పురోగతిని నిరసించినట్లవుతుంది. ఇంతవరకు కళాకారులు ఆదర్శాన్ని సాధించలేదు కనుక వెనుతిరిగిపోవటానికి వారి ఆత్మ

విశ్వాసము సమ్మతించదు. సాధించవలసిన ఆదర్శము ఇంకా ముందున్నది. సాధించామనే ఆదర్శము లక్ష్యసాధనలో పయనించవలసిన ఒక మార్గము మాత్రమే. కానీ, మహాభారతములో సూచించిన రససృష్టి మార్గాలే లక్ష్యసాధనలో అవలంబించాలని అనుకొంటె, ప్రపంచ సాహిత్యములో దానికి నిర్ణీతమైన స్థానమేర్పరచి అటువంటి మార్గాలు మరికొన్ని సూచింపబడి వున్నవి. కళాకారు లింకా లక్ష్యాన్ని సాధించలేదు కనుక, ప్రపంచ సాహిత్యములో సూచించిన సిద్ధాంతాలు మార్గాలు మాత్రమే అవుతున్నవి.

అయితే విశ్వసాహిత్యములోని పలు మార్గాలు లక్ష్యాలు—భారతదేశంలో సాధించినవే అని కొందరు విశ్వసిస్తున్నారు. మహాభారత రచయిత యగు తిక్కన వంటి ప్రతిభాశాలురు — కళారంగంలో పుట్టలేదని, పుట్టబోరని, పుట్టగూడదని, – కవిబ్రహ్మత్వము అతనికే సిద్ధిస్తుందని కొందరు విశ్వసిస్తున్నారు. అనగా వీరి దృష్టిలో లక్ష్యాలు ఆదికాలమునాడే సాధించబడ్డాయని, నేటి పురోగతి కేవలము అనుకరణయే అని భావిస్తున్నారు. వీరు భూత, భవిష్యత్తు, వర్తమాన కాలాలకు గూడ నిర్దిష్టమైన సిద్ధాంతాలను జోడించి బ్రహ్మానందపు రుచులను అనుభవించి ఋషులవలె సెలవిస్తున్నారు.

కవిబ్రహ్మ పుట్టడు, పుట్టబోడు, పుట్టగూడదు అని సిద్ధాంతీకరించే కళాకారుల సిద్ధాంతాలు అసమంజసాలుగా రుజువవుతున్నాయి. రామాయణాన్ని—సీతాయణముగా సంస్కరణ అనే పేరుతో రచించినపుడుగాని, భారతములోని రససృష్టిని అనుకరించినముగాని, అది అనుకరణయేగాని మరొకటి కాదు. పోని భారత రామాయణములలో రస సృష్టికి బ్రహ్మత్వము సిద్ధింపజేస్తున్నారా అంటే, అదిలేదు. కాని అనుకరణలో పురోగమిస్తున్నారు.

ఆదికాలమునుండి సూచింపబడిన మార్గాలను అనుకరిస్తూ దేశీయులైన విదేశీయులైన ఏ కళాకారులైన ఇంతవరకు లక్ష్యాన్ని సాధించలేదు. సాధించామని అనుకొంటే–కళలకు పరిమితి ఏర్పడి ఆనందానికి, మానసిక ఆనందానికి, బ్రహ్మానందానికి తిలోదకాలిచ్చిన వారవుతూ, కేవలం, అనుకరణకే దాసులవుతూ, పురోగతిని నిరసించే వారవుతున్నారు. పురోగతిని నిరసించినప్పుడు అధోగతిపాలవుతూ – నిన్నటి చర్యలకు ఆధారాలు వెతుక్కుంటూ, చర్యలనే ఆశ్రయిస్తూ– నేడు లేదని, రేపు ఉండదని, పిడివాదాన్ని ఆశ్రయించి వారవుతూ మానసికానందానికి నకులవుతూ – సత్యాన్వేషణను పరిమితము చేసినవారవుతారు.

కవిబ్రహ్మలు భారతదేశములోనే ఉన్నారనుకుంటే బయటి ప్రపంచంలో కన్పించే కళాకారుల స్థాన నిర్ణయముకూడ జరగాలి గదా! ఎందుకంటే ఒక విశిష్టతకు ప్రాధాన్యం ఇచ్చినప్పుడు మరొక విశేషము అప్రధానమవుతుంది. ప్రధాన ప్రాధాన్యంలోనే గదా మార్గాలను అన్వేషిస్తున్నారు. అందుకే విశ్వసాహిత్యములో సూచించిన మార్గాలు నేటి కళాకారుల మేధాశక్తిని సంచలనముచేస్తూ మార్గాన్వేషణకు దోహదమవుతున్నవి.

బ్రహ్మత్వము సిద్ధించినపుడు, లక్ష్యాలను అతి త్వరలో సాధించే మార్గాలు అందుబాటులో ఉన్నవన్నట్లే! భారతీయ ఆధ్యాత్మికపు కళాసంపదలో, బ్రహ్మానందం పొనగబడివుంటే-విశ్వమేధావుల దృష్టి ఎందుకు పరిపరి విధాలుగా పరిగెత్తుతున్నది ? పలు రకాల వాదాలు ఆనందతత్వాన్ని ఎందుకు చిందరవందరచేస్తూ మరొకదానికి ప్రాకులాడుతున్నవి ? అటువంటప్పుడు ఆధ్యాత్మిక-భౌతిక శూన్యవాదాలలోని అస్పష్టతలను ఏకపరచే వాదము మరొకటి ఉందనే ఆత్మవిశ్వాసము ప్రబలుతుంది.

ఈ మార్గాలు స్పష్టంగా విపులీకరించగలిగితే యుగయుగాలనుండి అన్వేషిస్తూ పురోగమించే మానవాళికి ఆదర్శాలు సాధించినట్లే అవుతుంది. కాని జీవితములో, వ్యక్తిస్వాతంత్ర్యము, శాంతి, న్యాయము, ప్రేమ – ఇంకా అసాధ్యాలుగా భావింపబడుతూ వాటిని సాధించటమే ఆదర్శమంటూ మానవాళి నడుము బిగిస్తున్నది. లక్ష్యసాధనలో అవలంబించే మార్గాలు ప్రతిమలుపులోనూ చీలిపోతూ నూతన మార్గాలు కన్పిస్తూంటే వాటిని ఉపలక్ష్యాలుగా పరిగణిస్తూ ఈ సుదీర్ఘమార్గాలను

చిన్నదిగా చేసుకోవాలనే ఆశలతోనూ, విశ్వాసాలతోనూ నిరంతరాన్వేషణ జరుగుతున్నది. రేపటి ఆదర్శాలు నేటి విశ్వాసాలుగాను, నేటి విశ్వాసాలు నిన్నటి లక్ష్యాలుగానూ, నిన్నటి లక్ష్యాలు మొన్నటి మార్గాలుగాను, మొన్నటి మార్గాలు క్రితము సాధించిన ఆదర్శాలుగాను—ఇట్టి విభిన్నఆదర్శాలు నేటి పురోగతిలో మిళితమై యున్నవి.

అన్వేషణ ఒకే ఆదర్శాన్ని సాధించటానికి లక్ష్యంగా ఉంది. రాగద్వేషాలకు మూల మేమిటి? న్యాయము, శాంతి, ప్రేమ, సాధించే దెట్లా? ఈ లక్ష్యం సాధించగలిగినట్లైతే మార్గాలు మూసుకుంటాయి. మార్గాలు మూసుకొన్నప్పుడు అన్వేషణ స్తంభిస్తుంది. అన్వేషణ స్తంభించినపుడు పురోగతి తిరుగుముఖము పడుతుంది. కాని నేటివరకు అది సాధ్యముకాలేదు కనుక అన్వేషణ పురోగతిలో ఉంది. ఈ నిరంతర సుదీర్ఘఅన్వేషణలో నిరుత్సాహపడి ఎవరూ అన్వేషణకు తిలోదకా లివ్వరు. మానవుని ఆత్మవిశ్వాసము అటువంటిది.

తిలోదకా లిచ్చేవారు, కళాకారులు కాలేరు. ఎందుకంటే వారు అనుకరణనే ఆశ్రయించినవా రవుతారు. అనుకరించేవారు సంఘసంస్కర్తలు. వారు సంఘాన్ని సంస్కరించటానికే వారి అన్వేషణను పరిమితము చేసుకొంటూ—ఆధ్యాత్మిక వాదాన్నిగాని, భౌతికవాదాన్నిగాని ఆశ్రయిస్తారు. కాని కళాకారులు శూన్యవాదాన్నిగూడ ఆశ్రయించి, సమన్వయములోని ఏకవాద సాధనకొరకు త్రివాదాలను మార్గాలుగా అవలంబిస్తూ, రససృష్టిలో పురోగమిస్తారు. పురోగమనములో మహానందాన్ని ఆస్వాదిస్తూ సహృదయులకు రసానందాన్ని కలిగిస్తారు.

శరీరపుష్టిలోని ఆనందం, భావపుష్టిలోని మానసికానందం, త్రివాదాలలోని ఏకవాదము, సమన్వయదశలో పొందే ఆనందం మహానందం. వారు ఋషులవంటివారు. స్వీయసంస్కారము చెంది ఋషిత్వములో తన సృష్టి అన్వేషణ విధానము అవలంబించేవారు కళాకారులు. వీరు సమస్యలను పరిష్కరిస్తారేగాని సమస్యకు లోబడరు. ఆదర్శాన్ని లక్ష్యంగా పెట్టుకొని మార్గాలను సూచిస్తూ, సహృదయులకు రసానందాన్ని కలిగిస్తుంటారు.

కళాకారుడు సత్యమైన ఆనందాన్ని పొందినపుడు, సహృదయుడు రసానందాన్ని ఆస్వాదించ కలుగుతాడు. మార్గాలు మారుతూఉంటే ఆదర్శాలు ఎల్లప్పుడు మిణుకుమిణుకుమని అస్పష్టంగా కనిపిస్తూ వుంటవి. కళాకారులు ఈ అస్పష్టము తొలగించటమే లక్ష్యాన్ని సాధించి ఆదర్శాన్ని స్థాపించినట్లు.



# ఈ జడత్వంలోంచి

## శ్రీ భైరవయ్య

ఆనందం
ఒక్కసారి వచ్చి
ఈ 'నిరంతర నిట్టూర్పుల'
విషాదాంత జీవిత ప్రాంగణాల ముందు నిలబడి
పలకరించి వెళ్లవూ

ఈ వేదనామయ జీవితాన్ని విలోకించి
ఈ మనసుని తిరోగమనంనుంచి రక్షించి
ఆశల పుష్పాడే చిలికించవూ

ఈ పలాయనవాదాన్ని
కప్పదాట్లని
నిరాశనీ, నిస్పృహనీ చూసి
విషాదాన్నీ, వైరాశ్యాన్నీ సృష్టించే మనస్తత్వాన్ని
విధివాదాన్ని అంగీకరించి
పురుషకారాన్ని విస్మరించి
అర్ధరాత్రిమీద గీతాలు వ్రాసి
గుక్కెడు సిగరెట్టు పొగలో స్వర్గాన్ని నిర్మించుకునే
నా అల్పమనస్సుని
ప్లీజ్
శస్త్రచికిత్సచెయ్యవూ

పబ్లిక్ రోడ్డుమీద
శేషశాయిలా పవ్వళించిన కుష్ఠురోగిని చీదరించుకుని
వేదిక ఎక్కి
నా అహానికి బంగారు తొడుగు కప్పి
స్వయంగా ఆచరించని సిద్ధాంతాలని
పదిలంగా పరుల కందజేసి

పెదాలమీద చిరునవ్వు మొలిపించి
కనపడ్డ ప్రతిజీవికీ
కమ్మగా కుత్తుకుల కురి బిగించి
వద్దు వద్దు
ఈ నటనల్ని —ఈ ముసుగుల్ని
చీల్చి
ఒకింత నిజాయితీ నాలో నిల్పవూ

విచక్షణ
ఆవేశాన్నీ —ఉద్రేకాన్నీ అధిగమించి
వివేకం ఉత్సాహాన్ని పుంజాకుని
చూడు ఆనందం
ఈ జీవితాన్నింక నటించలేను
దీనితో రాజీపడలేను
ఆదర్శాలు పగటికలలై —కల్లలై
ద్వేషం — కుటిలత్వం
స్వోత్కర్షకఫం కపాలంలో నిండిన
వ్యక్తులమధ్య
వ్యక్తిత్వ రాహిత్యం మధ్య
పెదాల వంకరల్లో చిరునవ్వులు చూపి
ఈ హిపోక్రసీ
ఈ తేలుకొండులమీంచి
నే న్నడవలేను

నిత్యదైనందిన సమస్యల్ని
భూతద్దంలో చూపిస్తున్న రాజరికాన్ని—

ఇలా ఒక్కసారి చూడు
కలంలో సిరా ఇంకిపోయింది
ఈ రాత్రి గడిచి
రేపు సూర్యుడు ఉదయిస్తాడని
కాలం చిగిరించి
సమానత్వం —మానవత్వం
సగటుగా పంక్తి భోజనం పెడతాయని
కాటుక అవసరంలేని కనురెప్పల కింద

## ఈ జడత్వంలోంచి

ఏవో మిణుగురులా —
ఎల్లలు ప్రబద్ధలై
వసుమతి బొడ్డు మసిచెరిగి
గుండెలోతుల్లో ఇంద్ర ధనుస్సు
పంచరంగులు మేళవించిన తెల్లటి తెలుపు
నీలా
అందంగా
అమ్మ[ చనుబాలలా —

ఆనందం
ఈ కమిలిన గుండెల్ని
కాలిన పెదాల్ని
ఒక్కసారి నిమిరి
కళ్లల్లో కొడిగట్టిన ఒత్తుల్ని
దుమ్ముకొట్టి మాసిపోయిన మనస్సుని
ఒక్కసారి విదిల్చి
నువ్వొస్తే చాలు
వసివాడిన రేకులు తిరిగి పులకిస్తే చాలు.



ఆలోచనలు దారి తప్పినట్టున్నాయి – అనుకొన్నది. నరాల్లో శక్తి నశించినట్టు, బలహీనత కృంగదీస్తున్నట్టుగా ఫీలయింది.

మోచేతిని తలకు ఆదరువుగా పెట్టుకొని బండమీద పండుకొన్నది.

ప్రక్కయింటి దొడ్లో రాక్షసి కూతురిలా అడ్డదిడ్డంగా పెరిగిన వేపచెట్టువుంది. చెట్టుమీద పక్షి గూడుంది. ఆ గూట్లో పక్షులు రొద చేస్తున్నాయి.

ఆ చెట్టును, ఆ గూటిని, ఆ పక్షులను రోజూ చూస్తూనేవుంది రేవతి.

'తనుకూడ ఆజంటలో ఒకటియై పుట్టుంటే ఎంతో హాయిగా, మధురంగా గడిపే దీరాత్రి'.

అవి జామచెట్టుతో మొరపెట్టుకోవాలనుంది రేవతికి.

'కానీ ఏలా?'

'తన మనస్సుకు భాషవుందికాని, రవంలేదు. చెట్టుకూడ అంతేనేమో? తను యితరులతో ఎంత చెప్పుకోగలదో చెట్టుతోకూడా అంతే. పైగచేస్తే దాని కర్థమవుతుందా? తన మనస్సులోని ఆంతర్యం గ్రహిస్తుందా?...ఛీఛీ...ఏమిటో పిచ్చిదానిరాతలా అనూహ్యమయిన వూహాలు' అని అనుకొనబోయింది, కాని మనస్సు ఆ వూహాలను కొట్టిపారేసింది.

రోజూచూసే ఆకాశం, చంద్రుడు, చుక్కలు. కాని యీ రోజు క్రొత్తగా తోస్తున్నాయి రేవతికి.

'చంద్రుణ్ణి అందుకోడానికి ఆ నక్షత్రం ఎందుకంత వేగిరపడుతోంద'ని ప్రశ్నించుకొనింది.

వేపచెట్టుమీద గూట్లోని పక్షులు శబ్దం మానివేశాయి.

రేవతి ప్రశ్నకు సమాధానం మనస్సులో ఒక మూల మెదలింది.

'వాటి అదృష్టంలో తనకు శతాంశమయినా వుంటే, నేను అదృష్టవంతురాలి నయ్యేదాన్ని.'

చెమర్చిన కనులు మూసుకొనేటప్పటికి నిద్ర ముంచుకొచ్చింది.

* * *

తనది రేవతీ నక్షత్రమట. నక్షత్రమాలలో రేవతి కడపటిది. నాన్న సంతానంలో తను మొదటిది.

అమ్మ చెప్పిందాకా తన వయస్సు తనకుసరిగ్గా తెలియదు. అమ్మ ఒకసారి నాన్నతో అంది. 'రేవతికి యిరవై ఆరేళ్ళు దాటాయి. దానికి పెళ్ళి పెటాకు లేమయినా రాసివుందా?'

ఎందుకో అమ్మకు తనంటే మహాద్వేషం. పరోక్షంలోకూడ ఆ కోపాన్ని చూపిస్తూవుంటుంది.

నాన్నమాత్రం కరుణామయుడయిన వేదాంతి. అందుకే, 'పాపం! భగవంతుడెలా వ్రాసిపెట్టాడో అన్నిటికీ వాడిదయ కలసిరావాలి.' అన్నాడు.

ఏమయినప్పటికీ యింట్లో తను ఒకతినని ఎవరు పట్టించుకోరు. తన చెల్లెళ్ళు సరేసరి. తన నెవరు 'అక్కా'యని పిలిచినట్లు గుర్తులేదు.

తను కర్మ చేసుకొని పుట్టిందా?

రాధ, సుజాత యిద్దరే తనకు స్నేహితురాండ్రు. వారిద్దరి పెళ్ళికికూడ తను వెళ్ళింది. వారిద్దరున్నపుడు తనకు మరో ఆలోచనే వుండేది కాదు. ఏవేవో చెప్పేవారు. నవ్వించేవారు. తనకు నవ్వడంకూడ సరిగ్గా చేతకాదు. వారి నవ్వుకంటే స్వచ్ఛంగా, తీయగా నవ్వాలని వుంది. ఒక్కసారి గలగలమని మాట్లాడాలని వుంది. నగకోసం పాపాయి గొంతు నులిమేసిన కర్కోటకుడయిన దొంగలా, వినోదంకోసం తన నోరు మూసేశాడు దేవుడు.

అందరు అనుకునే అనాథనాథుడు.........

ఆలోచిస్తూనే కుమిలి కుమిలి ఏడుస్తోంది రేవతి.

రేవతి దుఃఖంలో పాలుపంచుకొనే అనురాగం వున్నది, ఆమె నేసుకున్న దిండుకు మాత్రమే. అందుకే ఆమె దుఃఖంలో సగభాగం గ్రహించి గుండెను బరువెక్కించుకొని తడిసిపోయింది.

శ్రవ్యకాలలో శిథిలమయిన శిల్పం కన్పించినా భూగర్భ పరిశోధకులు సంతోషంతో ఎగిరి గంతులు వేస్తారట.

తనుపుట్టినప్పుడు అమ్మ కళ్లనీరు పెట్టుకొంటే, నాన్న ఓదార్చాడట అంతా దేవుడిమీదకు నెట్టివేస్తూ.

తను పుట్టిన చాలకాలంవరకు పేరు పెట్టలేదట.

'అంతటి వికారానికా నామకరణం?' అని అమ్మ నాయనమ్మమీద విరుచుక పడేదట, ఆ ప్రసక్తి వచ్చినప్పుడెల్లా.

వీరిద్దరిపోరు భరించలేక నాన్న ఒక రోజు, జన్మ నక్షత్రం గుర్తుకు తెచ్చుకొని, రేవతి అని పిలిచాడట.

'కాకిపిల్ల కాకికిముద్దు, ఎందుకని?'

తన ఎనిమిదేళ్ల చెల్లెలు అమ్మను అడుగుతోంది ఒకనాడు పాఠాలు చదువుకొనే సమయంలో.

'అది దానికి తల్లి కదూ? అందుకని.' అమ్మ జవాబిచ్చింది.

అనుకోకుండా గతం గుర్తుకొచ్చేసరికి 'తను కాకిపిల్లకూడ అయిందికాదు. అందుకని...?' అని అనుకొంది.

నవ్వుతోపాటు దుఃఖం ముంచుకొచ్చింది రేవతికి.

కొంతసేపయిన తరువాత పైటతో ముఖం తుడుచుకొని, కళ్లు వొత్తుకొని గది బయట కొచ్చింది.

ఏదయినా పని కల్పించుకొని చేస్తేగాని మనస్సుకు విశ్రాంతి వుండదు. అమ్మ ఎప్పుడు రేవతికి పనిజెప్పదు. చెల్లెళ్లకు దగ్గరకు రావడానికే భయం.

ఇంట్లో అందరు తొందర పనులున్నట్టుగా హడావుడిగా కనిపించారు. ఎందుకంత సంబరంగా వున్నారో రేవతికి తెలియదు. ఎవ్వరు చెప్పలేదు కూడ.

పెద్దచెల్లెలు నిర్మల మల్లెమొగ్గలు దండకడుతూ కూర్చొనివుంది. తనుకూడా సహాయం చేయాలనుకొని వెళ్లి దగ్గరగా కూర్చొనింది రేవతి.

నిర్మల రేవతితో మాట్లాడక మాల కట్టడములో నిమగ్నురాలయ్యింది. రేవతికూడ మరో దండ కట్టింది. రేవతి దండ కడుతుండగా, నిర్మల తల దువ్వి జడవేయమని నూనె, దువ్వెన, అద్దం తెచ్చింది.

నిర్మల అంత చనువుగా వున్నందుకు ఆనందపడింది రేవతి. నిర్మలకు వదులుగా జడవేసి మల్లెమొగ్గలదండ తురిమింది. ముఖానికి పౌడర రద్దుకొనింది నిర్మల. రేవతి నిర్మల కళ్లకు కాటుక పెట్టి, చక్కటి తిలకంతీర్చింది.

అమ్మ వంటయింట్లో పిండివంటలు చేస్తున్నట్టుంది. ఇల్లంతా తీపువాసన చుట్టుకొనింది.

ఇంత సాయంత్రంవేళ పిండివంట లెందుకు చేస్తున్నారో తెలుసుకోవాలని వుంది. కాని అది వీలు కానట్టేది.

వంటయింట్లోనుండి అమ్మ నిర్మలను కేకేసింది.

'పెట్టెలోనుండి మంచి చీరతీసి కట్టుకో ?'

నిర్మల రేవతి వైపొకసారి చూచి పెట్టెలున్న గదిలోనికి వెళ్లింది. రేవతికూడ ఆమెవెంట వెళ్లింది గదిలోనికి.

తరువాత కొంతసేపటికి నిర్మల సిల్కుచీరలో మెరసిపోతూ గది బయట కొచ్చింది. రేవతి కొతకి అందం కొనితెచ్చుకోలేక, దేవుడు వదలిన బొమ్మలాగే నిర్మలను అనుసరించి వచ్చింది.

సిల్కుచీరలో నిర్మల అందాన్ని చూడడాని అమ్మ తొందరపడుతు వచ్చింది.

'నిర్మలా, ఎంత బాగున్నావు. చీర ఎంత బాగా కట్టుకున్నావు!'. మురిసిపోతూ అంది అమ్మ.

'అక్కయ్య కట్టిందే'.

నిర్మలమాటల్లో ఏ భావం గోచరించలేదు రేవతికి.

అమ్మ మురిపెం ఆమాట వినడంతో మాడి పోగా, పనివున్నట్లు విసవిసమని వంటింట్లోకివెళ్లింది.

'ఎందుకో అమ్మకు నేనంటె అంతకోపం'. రేవతికి కళ్లల్లో నీళ్లుతిరిగాయి.

అవి నిర్మల చూడకూడదనుకొని దొడ్లోనికి వెళ్లింది.

దొడ్డిలోని జామచెట్టు, ప్రక్కయింటి వేప చెట్టుమీదనున్న గూటిలోని కాకిజంటను మించిన ఆప్తుల్లేరు. కానీ, తనగోడు వినిపించుకోడానికి అది తగిన సమయంకాదని రేవతికి తెలుసు.

బావిదగ్గ ముఖంకడుక్కొని లోపలకువచ్చింది.

అప్పటికే నాన్న వచ్చినట్టున్నాడు. అమ్మతో విశేషాలు చెబుతున్నాడు.

'ఏడు గంటలకల్లా వారు వచ్చేస్తున్నారు. అంతా రెడీగా వుండాలి' అని నాన్న చెబుతుంటే 'ఎవరు వస్తున్నారు?' అని మరో ప్రశ్న వేసుకొని మనస్సులో దాచుకొనింది రేవతి.

నాన్న ఏదో పనున్నదంటూ యిల్లు వదలి అటు వెళ్లగానే, చిన్నపనున్నదంటూ నాలుగిళ్లవతలి కామాక్షమ్మ యింట్లోకి వచ్చింది.

'సావిత్రమ్మా, ఏమిటి విషయం? చాల పని పెట్టుకున్నట్టున్నావు?'.

అడిగింది అమ్మను.

'మరేం లేదు. పెళ్లిచూపులకి మదనపల్లెవా ళొస్తున్నారు.'

సంబరంగా, సంతోషంగా, తేలికగా అమ్మ చెప్పడం విని అక్కడే నిలబడింది రేవతి.

'ఎవరికి? రేవతికేనా. పోనీలేమ్మా యిన్నాళ్ల కయినా కలిసొచ్చింది.'

సానుభూతి ధ్వనించింది కామాక్షమ్మ మాటల్లో.

ఆమె మాటల్లో వ్యంగ్యంలేనందుకు సంతో షించింది రేవతి.

అంతలో తనకు తెలియకుండానే పెళ్లిప్రయ త్నాలు చేస్తున్నారా —అని ఆశ్చర్యపడింది లోలోపలే.

'అది మాకు ఎక్కువయి ఏడుస్తుంటే, దాని కదొక్కటే తక్కువ.'

రేవతి అమ్మ మాటలు వినకూడదని గది లోనికి పరుగెట్టింది.

కానీ అమ్మ మాటలు వెన్నాడాయి.

'ఆ కొరివిముఖాన్ని ఎవరమ్మా కట్టు కొంటారు.'

'పాపం. రేవతికి అన్నీ తక్కువచేశాడు దేవుడు.'

కామాక్షమ్మ అంటున్న మాటలుకూడ విని పించాయి రేవతికి.

'అమ్మకన్నా కామాక్షమ్మే నయం.'

చాలమార్లు మననం చేసుకొనింది.

'పాపం చేసుకున్నవారు నరకానికి పోతే, చర్మాన్ని చీల్చి పుప్పొకారం కూరుతారు. నోరులేని రేవతిని బాధపెడితే నీ కంతకన్న ఘోరమైన శిక్ష పడుతుంది.'

నాయనమ్మ అమ్మతో ఆ మాటను ఎన్నో మార్లంది.

'అమ్మకు అలాంటి శిక్ష వద్దు.' అని నాయ నమ్మతో చెప్పాలనుకొనేది రేవతి ప్రతిసారీ.

అబ్బురంగా ఆరేళ్లు సాకి రేవతిని అనాథనుచేసి వెళ్లిపోయింది నాయనమ్మ.

'నాయనమ్మ ఎక్కడ పుట్టి పెరుగుతోందో ఏమో?' పునర్జన్మ అనేది వుందని రేవతి నమ్మకం. అమ్మ ఒక్కసారయినా తనతో నవ్వుతూ మాట్లా డితే తన కంతే చాలనుకొనేది రేవతి. ఆలోచనలతో మనస్సు బరువెక్కిపోయి కళ్లు చెరువులయ్యాయి.

'అమ్మా, నాన్నా తనకు అన్యాయం చేస్తు

న్నారు. తనకు యిరవై ఏడో సంవత్సరం. చెల్లెలికి పద్ధెనిమిదో సంవత్సరమే. తనకంటే ఎంతో చిన్నది.

అయినా దానికిముందే చేసేస్తున్నారు.'

మనస్సు పరిపరివిధాల ఆక్రోశిస్తూంది.

రేవతి వునికిని గురించి పట్టించుకొనేవారు లేరు గనుక, చీకటిపడిన తరువాతకూడ ఏడుస్తూ గదిలోనే వుండిపోయింది. అలా ఏడవడం, తలగోడు-జామచెట్టుకో, కాకిజంటకో మొరబెట్టుకోవడం, వాటినుండి పానుభూతి లభించినట్టుగా వూరట చెందటం రేవతి కలవాటు.

ఇంతలో హాల్లో గలగలమని మాట్లాడు తున్నట్టు శబ్దమయ్యింది. రెండు మూడు కొత్త స్వరాలు కూడ వినిపించాయి. వారెవరో తెలుసుకోవా లన్న కుతూహలం పెరిగి, రేవతి గది తలుపులు మెల్లగాతీసి చూసింది. హాల్లో జంబుఖానామీద నాన్న, మరి ముగ్గురు క్రొత్తవారు కూర్చొని వున్నారు.

పాంటు టకప్ చేసినతనే కాబోలు నిర్మ లకు వరుడు - అనుకొనింది రేవతి.

వారు అమ్మ తయారుచేసిన ఫలహారాలు తీరిగ్గా తింటూ మాట్లాడుకొంటువ్నారు.

రేవతి దృష్టి వరునిమీదనే నిలచింది.

'అబ్బ, సన్నగా, ఎర్రగా, నాజూగ్గా ఎంత అందంగా వున్నాడు. నిర్మల అదృష్టం చేసుకొని పుట్టింది. తనకీ జన్మకు అలాంటి రాతలేదు.'

తన దురదృష్టాన్ని నిందించుకొంటూనే, నిర్మల అదృష్టాన్ని గురించి ఆలోచిస్తోంది.

నాన్న చేసిన సైగతో అమ్మ నిర్మలను పిలుచు కొనివచ్చి వారికెదురుగా కూర్చోబెట్టింది.

'సాయంకాలం కట్టిన మొగ్గలు అప్పుడే విరి సాయి.'

నిర్మల జడలోనున్న పూలు చూస్తూ అను కొనింది రేవతి.

'అదృష్టవంతుల జాతకాలుకూడ అలా విరిసి పోతూంటాయి'—

మనస్సులో లీలగా మెదలింది భావన.

పెళ్లి చూపులు అయిందనగానే నిర్మల, అమ్మ హాలునుండి నిష్క్రమించారు.

'అలా తిరిగొస్తానని' వరుడు వెళ్లిపోయాడు.

వెళ్ళుతున్న అతన్నిచూస్తూ, 'మెరుపులా ఎంత అందంగా నడుస్తాడు.' అనుకొంది. అతన్ని అప్పుడే మరోసారి చూడాలని ఆసక్తి కలిగింది రేవ తికి. కాని, అతనప్పటికే కనుమరుగయ్యాడు.

వరుని తండ్రి అయ్యుంటాడు, నాన్నను అడుగు తున్నాడు రేవతిని గురించి.

నాన్న ఏమి జవాబు చెబుతాడేనోనని రేవతి వూపిరి బిగబట్టి, చెవులు నిక్క బొడుచుకొనింది.

'అది దానికి శాపమో, మాకు శాపమో గానీ యుండి, దానికి మూగతనం, వికృతరూపం ప్రసా దించాడు దేవుడు. అయినా తండ్రిగా నాకర్తవ్యం నేను చేయాలిగా. పది సంవత్సరాలు పెళ్లి ప్రయ త్నాలు చేశాను. ఎవరు ధైర్యంగా ముందుకొస్తారు చెప్పండి? అందుకని ప్రయత్నాలు మాని నమకోండి. దైవం ఎలా రాశాడో ఏమో?'

తన వేదాంతాన్ని జోడించి నాన్న కాబోయే వియ్యంకుడికి చెబుతుంటే కన్నుల్లో నీళ్లు తిరిగినా కోపమొచ్చింది రేవతికి.

'అంతా పచ్చిఅబద్ధం. నన్ను ఒక్కనాడు పెళ్లికూతురిలా సింగారించలేదు. నాన్నదంతా కపట నాటకం' అని ఎలుగెత్తి గట్టిగా అరవాలనిపించింది రేవతికి.

కాని, తనకటువంటి అవకాశంలేదని తెలిసే సరికి; కళ్ళల్లో తిరుగుతున్న నీళ్ళలా, గొంతును పూడ్చేస్తున్న దుఃఖంలా మనస్సులోనిమాటలు మనస్సు లోనే గిర్రున తిరిగిపోయాయి.

నులక మంచంమీద పడిపోయిన రేవతికి మెల కువ వచ్చేసరికి అందరు భోజనాలుముగించి తాంబూ లాలు సేవిస్తున్నారు.

మెల్లగాలేచి అన్నం తినడానికని వంటయింటి

లోనికి వెళ్ళింది. అప్పటంటే అసహ్యంపుట్టి జామచెట్టు క్రిందికి వెళ్ళింది.

'చూశావా ? అమ్మా నాన్న చేస్తున్నపని'.

కన్నీళ్లతో, గద్గదమయిన మనస్సుతో మొర పెట్టుకొనింది రేవతి.

వేపచెట్టులోని కాకిజంట కాపురం పెంగబెట్టడంలో రొదచేస్తున్నాయి.

గాలికి జామచెట్టు వూగింది. పండొకటి రాలింది. రేవతి ఆనందంతో దాన్నితింటూ కాకిగూటి వంక జూస్తోంది.

రాధ, సుజాతలు గుర్తుకొచ్చారు. వారుకూడ వారివారి కాపురాలు యీలా గలగలలాడుతూ చేస్తుంటారు. పెళ్లయిన తరువాత నిర్మలకూడ అంత కన్నా ఎక్కువసంతోషంతో వుండాలి. తనచెల్లెళ్ళకేం అవసరాలు. వారి నలా సృష్టించి దేవుడెంతో మేలు జేశాడు. లేకపోతే, అమ్మ ఎంతగా కుమిలిపోయేది పాపం!...రేవతి ఆలోచనలకు ఒక దరిలేదు.

రాధ పెళ్ళికిరమ్మని బలవంతం చేసింది. తను సుజాతతో కలిసివెళ్ళింది. తరువాత త్వరలోనే సుజాత పెళ్ళికూడ అయ్యింది. సుజాతే చెప్పింది, తనకు ఆయనకు రాధపెళ్ళిలో పరిచయం అయిందట. ఇద్దరు ప్రేమించుకున్నారుట. ఆయన తల్లిదండ్రులు పెళ్ళికి వొప్పుకున్నారట ...

తనుకూడ ఎవరినయినా ప్రేమిస్తే—తన ఆలోచనకు తనే చిలిపిగా నవ్వుకొనింది రేవతి.

నిర్మల పెళ్ళికి యిరువైపుల బంధువర్గమంతా వచ్చింది. రేవతికి అందరిమధ్య మెరపులా తిరగాలని వుంది. అమ్మ చూస్తే కోప్పడుతుందేమోనన్న భయం కూడ వుంది. అయినా వున్నంతలో మంచి చీరకట్టుకొని సింగారించుకొనింది.

నిర్ణీతమయిన పని లేకున్నా పనివున్నట్లే తిరుగుతోంది పెళ్ళి ఇంట్లో. కాని రేవతిని గమనించిన వారు లేకపోయారు. నిరాశతో నిలువెల్లా వణికి పోయింది.

వయస్సులో వున్నవాడు తనవైపు సాభిప్రాయంగా చూస్తే, అతనివైపు చూసి చిరునవ్వు నవ్వాలని వుంది. అయినా అవకాశం రాకపోతుందా అని ఒక స్తంభం పట్టుకొని నిలబడింది. ఎవరికివారు వస్తున్నారు, పోతున్నారు. తనను దాటిపోతున్నారు. దాటి వస్తున్నారు. కాని తనక్కడ నిల్చున్నట్టే ఎవరికీ గుర్తులేదు.

మ్యూజియంలోని పురాతనశిల్పంలా వున్న తను ఎవరిని ఆకర్షించగలుగుతుంది? నిరాశ కలిగింది. నిస్పృహ ఆవరించింది. మనస్సు బరువెక్కిపోగా తేలికబరచుకొనేందుకు జామచెట్టువద్దకు వెళ్ళింది.

జామచెట్టువద్ద పందిరివేసి వంటపని చేస్తున్నారు. అయిదారుగురు పనివాళ్ళు వంటపనిలో నిమగ్నులయి వున్నారు.

రేవతి బండమీద కూర్చొని వారినే గమనిస్తూవుంది. అందులో ఒకనిపై రేవతి దృష్టి నిలచింది. పొట్టిపొడుగుగాని విగ్రహం, బలమయిన చేతులు, కోలముఖం, ఆకర్షణీయమయిన మీసకట్టు, రేవతిని ఆకర్షించాయి. పొయ్యివేడికి చెమట బట్టి ముఖంపైన స్వేదబిందువులు ఆణిముత్యాల్లా మెరుస్తున్నాయి.

చల్లనిగాలికోసం యివతలికి వచ్చాడతను, ముఖాన బట్టిన చెమటను తుడుచుకొంటూ.

రేవతి అతన్నే తదేకంగా చూస్తోంది. అతను రేవతివైపు క్షణకాలం చూచి, చిరునవ్వు నవ్వాడు. రేవతి ఒక్కసారిగ పులకించిపోయింది. శరీరంలో విద్యుత్తు జనించినట్టుగా కంపించిపోయింది.

నల్లని ఆకాశంలో మెరపులా అతని చిరునవ్వు ఎంత అందంగా వుందని జామచెట్టులో లోలోపలే అంది. మనస్సు నిండుగా సంతోషంగా వుంది.

ఆలస్యం చేయకూడదనుకొని, తనుకూడ చిరునవ్వు నవ్వింది రేవతి.

అతను మరల నవ్వాడు.

రేవతి మరల మరల నవ్వింది.

అతను మునివేళ్ళతో క్రింది పెదవిని కొరుకున్నాడు.

* * *

నిర్మల పెళ్ళి జరిగిపోయింది. అత్తవారింటి నుండి మళ్ళ పుట్టింటికి వచ్చింది. అక్కడి సంగతు

లన్నీ అమ్మతో ఏకరువు పెడుతోంది. భర్త తనపై చూపిన అనురాగాన్ని పూసగ్రుచ్చినట్లు అరమరికలు లేకుండా చెబుతోంది.

తనకు పెళ్లయివుంటే యిలాంటి వంబరమే పడేది-అనుకొంది రేవతి.

నిర్మలకు నెల తప్పింది. అమ్మ సంతోషానికి మేరలేకపోయింది. నాన్నను, అల్లుడుగారిని రమ్మని వెంటనే వుత్తరం వ్రాయమంది. ఇంటిల్లిపాదికి ఆ రోజు పండగయ్యింది.

తనకు నెల దాటిందని లెక్కపెట్టుకొని భయపడింది రేవతి. ఇంటిలో తన నెవరు పట్టించుకోరు గనుక కొంత ధైర్యం. కానీ, ఆ ధైర్యం చాలకాలం నిలువలేదు.

తనలో 'అతను' పెరుగుతున్నాడేమోనని రేవతి అనుమానం. జామచెట్టుతో చెప్పుకొనింది.

కాకిజంట గుర్తుకు రాగానే వాటిలా తను కూడ కొన్ని క్షణాలు తృప్తిగా బ్రతికాననుకొనింది.

కాని అంతలోనే ఒక్కక్షణంకోసం ఒక్క జీవితాన్ని నాశనం చేసుకున్నాను కదాని ఖేదపడింది.

రాను రాను, ఒకనాడు చేసిన తొందరపని పాపవు పుట్టలా పెరగజొచ్చింది. తన సంగతి కొంతకాలానికయినా బయటపడకపోదు. ఆ నాడు యింటా బయటా తనను చిత్రవధ చేయకపోరు...

తను పొరబాటే చేసింది.

అంతగా తొందరపడి వుండకూడదు...

నల్లటి ఆకాశంలాంటి 'అతని' విశాల వక్షస్థలం తను ఆశించియుండకూడదు...

తను అగ్నిని నొడిగట్టుకొనింది. అది తనను దహించివేస్తుంది...యింటిలోని అందరిని దహించి వేస్తుంది.

పెళ్లి కావలసిన మరి యిద్దరు చెల్లెళ్లకు తన కళంకిత రూపం ఘోరంగా, వికృతంగా అడ్డు నిలుస్తుంది. ఆ పసి హృదయాలు తనకోసం బలయి పోతాయి.........

తన తొందరపాటుకు పర్యవసానం కంటి ముందు తిరుగసాగింది.

కాకిజంట తన అనుచిత ప్రవర్తనకు నవ్వసాగాయి.

జామచెట్టు సానుభూతి చూపడంమాని వికృతంగా అపహాస్యం చేస్తోంది.

అమ్మ ఒక మూల, చెల్లాయిలు మరో మూల దుఃఖంతో కుళ్లిపోతున్నారు. నాన్న అవమానంతో నలుగురిలో ముఖం దాచుకొని తిరుగుతున్నాడు. తన స్నేహితురాండ్రు నవ్వుకొంటున్నారు. ఇరుగు పొరుగులు సూదుల్లా నవ్వుతున్నారు...

దుర్భరమైన జీవితం కళ్లముందు తిరుగసాగింది...

రేవతి భరించలేకపోయి భోరున ఏడ్చింది.

తను లేకపోయినా ఎవరికీ బాధలేదు. తన్ను జూచి అమ్మా, నాన్న సంతోషపడిందీ లేదు. ముఖ్యంగా తనంటె ఎవరికీ ఆదరణ లేదు.

ప్రేమ కరువయిన జీవితం వృధాయని తోచింది రేవతికి.

రేవతి మనస్సును విషాదం క్రమ్మినట్లుగా, ఆకాశాన్ని చీకట్లు కప్పివేశాయి. కాకిజంటవద్ద, జామచెట్టువద్ద సెలవు తీసుకొని బయలుదేరింది.

రైలు దూరంగా ఎక్కడో కూతపెట్టింది.

రేవతికి నాయనమ్మ గుర్తుకొచ్చింది. ఆ వెంటనే అమ్మ గుర్తుకొచ్చింది. కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

'అమ్మకు శిక్షవద్దు'. అని కడపటిసారిగా అనుకొనింది.

దూరాన వస్తున్న రైలు దగ్గరకు రావడంతో రైలుపట్టాలు గడగడలాడాయి. రేవతి గుండె దడదడలాడింది.

భయంగా ఆకాశంవంక చూస్తోంది.

నల్లటి ఆకాశం, నక్షత్రాలను ఒళ్లంతా కళ్లు చేసుకొని తననే చూస్తోంది.

రైలు మీద మీదకు వచ్చేస్తోంది పాపం వంటి చీకటిని చీల్చుకుంటూ.

రేవతి వాదుకొందామని ఒక నక్షత్రం రాలిపడింది.

* * *

'అశ్వనీ నక్షత్రం పుట్టిందని' పంచాంగాలు ఘోషించాయి.

# మృత్యుసాంత్వనము

శ్రీ టి. బి. యం. అయ్యవారు

"కృపణాశ్రు పరిక్లేదో
దహేన్మామ్ శాశ్వతీ స్సమాః."— భార, శాంతి.

మృత్యువు :

నవనవాశామరందపాన ప్రమత్త
మీ ధరిత్రీ ప్రజాతతి నెట్లు కడఁగి
వాశ మొనరించెదను? వసంత ప్రఫుల
ముగ్ధసుమరాశి విప్పులు పోయఁగలనె?

అమృతలతా నిబద మయి
నట్లు పరస్పర గాఢరాగ పా
శముల నియంత్రితమ్మయిన
సాధుజగమ్ము—కఠోరశస్త్ర పా
తములను జీల్చివేయగల
దాననె? యీదృశదారుణానుభా
వము భవదాత్మజాత తల
పై లిఖియించెదవయ్య! వేధనై—

ఈ సుకుమార పాణియుగ
మేగతిఁ దాల్చు సరోజ సోదరం
బాసురవృత్తి కర్ణమయి
నట్టి కఠోరత—యీ వినూత్న శో
భా సముదీర్ణ భిత్తి పయి
వ్రాయుదునయ్య! దురంతదుఃఖ ధూ
మాసితవక్రరేఖ లిది
యౌ! మదుదాత్త తపఃఫలంబహో—

వెన్నెలతీవ చాలు కురి
పించుట నేర్పితి వీ విలోచనో
త్పన్న కటాక్షమాలలకు
బాల్యమునుండియు నింక నీ ప్రభా
త్యోన్నతిఁ గాలకూట దీప
నోగ్ర కణచ్ఛటఁ గ్రుమ్మరింతునా!
యున్ని మనోజ్ఞ వస్తువుల
నేచి నిమేషమునన్ గ్రసింతునా?—

పరభృత కంఠమాధురులు
వాయవు—చారులతాంతమంజరీ
పరిమళ వీచికానుభవ
బంధము పోదు—రసాశ్రయమ్ములోఁ
బరవశమందు నీ యెడఁద
పట్టుల నేటికి—విశ్వభస్మసా
త్కరణము సాధ్యమే—సమమె
తామరరేకులు వహ్నికీలముల్?

వలపుల పంట లేమగలఁ
బాసి తపించు పాలంతులున్—జరా
కులితములైన యట్టి బ్రదు
కుల్ చవనీయక నిల్పి కాచు పు
త్రులకును దూరమై వ్యథల
త్రొక్కిడిఁ గూయిడు పేదజీవులున్
జలజల జారు నశ్రువుల
శాపము వోయ—భరింపుమందువా!—

జలనిధి వీచికా హతి వ
శమ్మునఁ గూలిన బొమ్మరిండ్లకున్
వలఁపుల స్రుక్కితిన్—చిఱుత
వాఁడు వినోదవిహారకేళి—న
చ్చలమున నేగతిన్ గసిమ
సంగుచుఁ గొంపలఁ గూల్చుదాన—నీ
యలఘుకళంక పంకభర
మక్కట! యెన్ని యుగాలు మోచెదన్—

ధాత :

ఎందుల కేడ్చెదవే? కనుల
నెఱ్ఱదనమ్ములు క్రమ్మ—చంద్రికా
సుందరమైన నెమ్మొగము
సోయగ మిందగ—నిన్ను చేయఁజొ
మ్మందునె? దుర్యశోమలిన
మైన యకార్యము చూపి—సూక్ష్మదృ
ష్టిం దిలకింప—సంశయ ని
శీథ తమశ్ఛట లెల్ల విచ్చెడున్—

బేలవు జాలిగుండియల
పెంపునఁ బల్కెదుగాక! యిట్లహం
తాలసితమ్ములైన వచ
నమ్ములఁ దాత్త్వికదృష్టి మాలి—నా
కేలను సృష్టి చేసితిని
కేవల మీ నిఖిలోర్వి—యీ దయా
శీలత నాకు లేదనుచుఁ
జెప్పెదవా! ధిషణాధురీణవై—

నీ కర్తవ్య మహత్త్వ మారయవు త
న్వీ! సారెకున్ ఘోరహం
సాకాండంబని బెగ్గలింతువు—వృథా
సందేహ మందేహవై—
శోకోదగ్ర హలాహలానల శిఖా
స్తోమావలీఢమ్ము—నీ
లోకం బంతయు నింత చూడవు దయా
ఘుత్యాతిరేకమ్మునన్—

తీరని శోకతాపముల
దిక్కఱు జీవులఁ బాలిటన్—సుధా
సారణివై—ప్రశాంతపద
సౌఖ్యము చూపెదు కన్నతల్లివై—
దారుణ దుర్మదైకపర
తన్ గృపణ ప్రజఁ గస్తివెట్టు దు
ర్వారులఁ బిల్కుమార్తువు! వి
రాగస వర్తను లెల్ల మెచ్చగన్—

ఎఱుఁగవు కాక తల్లివగు
దీవె—చరాచరభూతకోటి—కిం
దఱఁ గబళింతునన్న క్షుధముఁ
దక్కువము—ధారుణి నాడియాడి—క్ర
మ్మఱ సుఖసుప్తిఁ బొంద—ప్రియ
మారగ నీ శిశిరాంకపాలికిన్
బఱువిడ వచ్చు నర్భకుల
పైన—నిరాదృతిఁ జూపఁజోకువే—

త్వచ్చరణాంబుజాత సవి
ధంబున—దుర్గ్రహతత్త్వశాస్త్ర మ
ర్మోచ్చయమున్ గ్రహింతురు—ర
సోజ్వల దీప్తుల సంఘటించుచున్
దెచ్చు సమగ్రవశా పరిణ
తిన్—భవదీయ కరాభిమర్శనం
బిచ్చుటె సర్వజీవులకు—
నేమిటె కిట్లను తావ పొందగన్—

అనుఁగుం బిడ్డలఁ జేయి పట్టుకొని దీ
వ్యన్మూర్తి వై—దేవతా
వనులన్ ద్రిప్పెదు—నీ సహాయ గరిమా
వాప్తిన్—ధరాదేవి, నా
తన నైపథ్యము సంతరించుకొని నే
త్రప్రీతిఁ గావించు—ప్రా
క్తన నిర్మాల్యము లుజ్జగించి—యిటు చి
త్రక్షోభ నీ కేటికిన్?

అవనత సమస్త జన మస్తకాంచితమ్ము
త్వన్మహాప్రాభవ మ్మనవద్య మమ్మ!
నీలలోహిత కోటీర నిభృత నిలయ
జాహ్నవికి సాటివత్తువు! జయము నీకు!

---



దక్షిణదేశంలోని కథాకాలక్షేపాలలో భక్తుల భక్తి గీతాలు, రామాయణాదులలోని శ్లోకాలతో కూడ గానం చేయబడేవి.

19 వ శతాబ్దిలో శ్రీ వాగేపల్లి అనంత రామాచార్యులు హరికథలను రచించేరు. కాని మననాడు వింటూన్న సర్వాంగసుందరమైన హరికథల సృష్టికర్త శ్రీ నారాయణదాసుగారే. త్యాగరాజునకు ముందు సంగీతమును గురించి గ్రంథాలు ఉన్నా, రాగ సుధారసమున ఆసమాను లెందరున్నా, త్యాగయ్యగారి వాగ్గేయమాహాత్మ్య మపారము. హరిదాసు లెంతమంది ఉన్నా హరిదాసులంటే స్ఫురించే పేరు దాసుగారి పేరే. వీరే హరికథకు సాహిత్యపరముగను, సంగీత పరముగను ప్రతిష్ఠ తెచ్చిరి. "ఆస్తిక్యములు, ధర్మాధర్మములనూ సర్వజనమనోరంజకముగ నృత్యగీత వాద్యములతో నుపన్యసించుట హరికథ యనంబరగు. దైవభక్తియు, సత్యము, భూతదయయు హరికథ యందలి ముఖ్యాంశములు" అని ఈయన చెప్పిరి. నాస్తికత ప్రబలుచున్న ఈ రోజులలో దైవభక్తిని బోధించి ప్రజలకు ముక్తిమార్గమును చూపుటే తన కర్తవ్యమని భావించిరి.

సీ. 'ఘనశంఖవేణుయున గంటంబు పూరించి
మేలుగ శ్రుతిలోన మేళగించి
నియమము తప్పక నయఘనంబుల చెక్కు
రాగ భేదంబుల రక్తిగొల్పి
బంతు లెగిర్చిన పగిది కాలజ్ఞతవ్
జాతి మూర్ఛన లొప్ప స్వరము పాడి
చక్కని నృత్యము సర్వరసానుకూ
లంబుగాగ నభినయంబు చేసె
వ్యక్తుల మృదు యక్షగాన ప్రబంధ సరణి
వివిధదేశంబులం దిన్న పెద్దలుగల
బలుసభల హరిభక్తి నుపన్యసింప
లేని సంగీత కవితాభిమానమేల.'

అని వీరు తమ హరికథల ప్రధాన లక్ష్యమును చెప్పుచు తమ విశిష్టతను చెప్పిరి. సంగీత సాహిత్యాభినయములకు తావిచ్చి భక్తితత్వమును బోధించి భాగవతోపాఖ్యానము లితివృత్తములుగ నుండుట, వివిధ గేయ గద్యపద్యరీతులతో పరిఢవిల్లుట, సులభసుబోధకములగుట, రసానుకూలపాత్రను పోషించుట వీని విశిష్టత. ఈ విశిష్టత నారయుదము.

సంప్రదాయ సంగీత కీర్తనలో రాగపోషణ ప్రధానంగా ఉంటుంది. వివిధసంచారములతో గమన స్ఫూర్తితో లయ అంతర్వాహినిగా ఉంటుంది. సాహిత్యం రాగభావాన్ననుసరించి ఒదిగిఒదిగి ఉటుంది. కీర్తనలో మాట మాటగా తెలియకుండా రాగంతో సాగిపోతూ ఉంటుంది. హరికథమట్టులో సంగీత సాహిత్యములు సమాన స్థాయిలో పరస్పర పోషకంగా ఉంటాయి. నారాయణదాసుగారు సృత్యానుగుణంగా మట్టును రూపొందించారు. రుక్మిణీ కళ్యాణంలో 'సామి రావదేమిరా యో సర్వాంతర్యామి రో', హరిశ్చంద్ర చరిత్రలో 'జాతిచెరచెగాని నానీతి చెరుపగలదా విధి', జానకీ శపథంలోని 'ఏ యసూరు ఎవ్వారు తన యులు' అనునవి మరువునకు రానిమట్లు. గేయ ప్రబంధములలోని కీర్తన పద్ధతినీ రూపకములోని నాట్యమునూ, దేశిరూపకములోని నృత్యవిన్యాసమునూ, ప్రబంధములలోని వర్ణాంశములనూ వృత్తములనూ తెలుగు పద్యములనూ, స్వకల్పితములయిన కొన్ని పద్యములనూ చేర్చి వీరు హరికథలను రచించిరి. మహారాష్ట్ర హరికథలలో వాడబడే తొహరాలను రేకుమంజరులనే పేరుతో వాడియున్నారు. యక్షగానములలో లేని విశేషములలో ఇవి ముఖ్యమైనవి. ఈ మంజరి, మంజరి ద్విపదగాదు. సంభాషణలకు నడుమనున్న కథాంశములనుచెప్పే సందర్భాలలోనూ, కథను తొందరగా నడిపించవలసిన సందర్భాలలోను ఇవి వాడబడినవి. నర్తకి అనే మాత్రాచ్ఛంద జన్యమైన గేయాన్ని ఈయన మార్కండేయ చరిత్రలో, సావిత్రీ చరిత్రలోను వాడిరి. రగడలవే ఈ నామముతో వ్రాసిన టొహ్లాహించవచ్చును. మంజరీ నర్తకులలో పల్లవీ అనుపల్లవీ యుండవు. అన్నీ చరణాలే ఉంటాయి. రెండేసి భాగాలుగల చరణాలు రెండుగాని, మూడుగాని, నాలుగుగాని ఉంటాయి. రెండేసి భాగాలకు ప్రాస ఒకటే, ప్రతిభాగమునకూ యతి ఉంటుంది.

నర్తకి: 'చెంగి సెల యేటి యసుక తిన్నెపై చెరలాడు శార్దూలముల' అని.

గద్యములూ, పద్యములూ చూర్ణికలూ వచనములూ—అన్నీ కూడ గానము చేయవలసినవేగాని కేవల పాఠ్యములు కావు.

ఔచిత్యాన్ననుసరించి రసభావములకు తగిన రీతిలో శబ్దములు చిట్టస్వరములు మార్చే విధానంలో ఈయనది అందెవేసిన చేయి. భావము, భాష, రాగము, తాళమూ అను శక్తులు అన్యోన్యాశ్రయమైనవి. ఇవి వీరి రచనలో స్ఫుటమవుతూ ఉంటాయి. అంబరీష చరిత్రనుండి శృంగార వర్ణన కుదాహరణ చూడండి ఎంత రసభరితంగా ఉన్నదో! తమకు రూపసామ్యము కలదు కాని భావసామ్యము లేదుకదా యని శివుడు మోహినితో తన ఆవేదన నిట్లు తెలిపెను:

'నీ నెన్నుదురు గన్న నెలవంక తలపయ్యె
రాజితభీత సారంగనయన"

అని వారిరువురి సామ్యము చెప్పి,

'చెలువ మున గొంతపోలిక గలదు మనకు
గాని యినుమంతయైన నామానసంబు
మాడ్కి నీ మనమున్న మన్మథుని పీడ
నన్ను సోకుటయెట్లు లోసన్నుతాంగి'

అని వాపోయెను.

గజేంద్రమోక్షంలో సరస్సులోపల కరి మకరులకు ఘటిల్లిన పోరును పదములకూర్పుతో కళ్ళకు కట్టినట్లుగా కవి ఎట్లు వర్ణించెనో చూడుడు.

"కరియు మకరియును గరకరి
బొరయుచు జరిపి రపుడు ఘోరాజిన్
పరిబలముల రాతిరి పవలనకను
దిరముగ నిరువురు నోజన్"

ఈతరంగిణిని భైరవిరాగంలో పాడినపుడు రేఫసానుప్రాస్యము మరింత సొగసుగా ఉంటుంది. వారియుద్ధము ఎంత భయంకరమో ఈక్రింది రచన చెబుతుంది.

'ధరాధరమువలె శరీరము మెరయ గరాగరిగ జల
చరేంద్రు తనువును గరంబునబెనచి బిరాన విసరగ
గరేణువు లయ్యారే భళిభళిరే యనగ.'

రాముని విరహం 'జానకీశపథం'లో రాళ్ళను కరిగించేటట్లు వుంది.

'అయ్యో జీవేశ్వరీ - యింతయ్యేనా మన్మబతుకు
ఎయ్యెడనుంటివో—ఏమనుకుంటివో'
'అరయగ మనశోకము జన్మావధిగా జేసెవా!'

దూర్వాస మహర్షి జటలనుండి యుద్భవించిన ఘోరశక్తిని వర్ణించినతీరు సమానభూయిష్ఠమై భీతిని కలిగించును.

'అభ్రభంలిహో దభ్ర విభ్రమాభ్రభ్రమ
కృష్ణీల దీర్ఘ శరీర మమర'...అని

జాతీయ పద ప్రయోగంలో వీరందె వేసిన చేయి. 'వంటెంటి కుందేలు' వంటి సామెతలను హరికథామృతములో ప్రయోగించేరు. జాంబవంతుడు తన గుహను ప్రవేశించిన కృష్ణునితో

'ప్రేరితః శశక మహానవం
అచిరేణ మత్సకాశం విధినా' అనెను.

మోహిని రూపమును చూచి మోహించి శివుడు

'తొయ్యలి నెమ్మోము పున్నమ చందురు
ద్రోసిరా జనిపించురా!
వయ్యారి కొప్పు చమరీ మృగవాలము
పై కోత కోయించురా'

అని ఆమెను వర్ణించెను. ద్రోసిరాజా, పైకోత కోయించుట యనునవి చతురంగ బలముననూ, చీట్ల పేకయందును, దానిపైది వేరొకటి లేదను నర్థమున వాడబడు సాంకేతిక పదములు.

సావిత్రీ చరిత్రలోని గేయాలలో కథార్థములకు భంగంలేకుండా రాగముయొక్క పేరు చెప్పబడింది. కుంతలవరాళిరాగంలో రచింపబడ్డ గేయంలో 'భక్తాళి మానస మరాళి! కుంతలవరాళి' అని ఉన్నది.

కౌసల్య కువలె నాకున్—గట్టనె వుచ్చె,
నా సవతి కేలుబడియైన—వాసవి వచ్చె'

అని అనడంలో అంత్యప్రాస గలదు.

'పాహిమాం గోపాల! భాగవత జనానుకూల
దేహకాంతి విజితనీల—దివ్యానందాలవాల'

అని సంస్కృత గేయంలోకూడ అంత్యప్రాస నియమం చూపించేరు.

సంస్కృత భాషనుకూడ తెలుగు ఛందస్సులలో అమర్చి సరస్వతీదేవిని అలంకరించేరు.

సీసం. పాహి ప్రసన్న రూప! దయాకలాప! స
త్యావాప! సర్వలోకైక దీప

వీరి రచనలలో ఛందోవైవిధ్యము, రసవైవిధ్యమే కాక లోకరీతి ప్రదర్శన కూడ గలదు. అవినీతిని, అధర్మాన్ని హరిశ్చంద్ర చరిత్రలో వజ్రాయుధంవంటి మాటలతో ఖండించేరు.

'మంచి జీతముల ననుభవించియు
లంచముల దిన నేటికో'

అని వాపోయేరు. 'పరమార్థమెటు చిక్కును దంభము చేయు' అనే కీర్తనలో

'రంగు పాగాజుట్టి—దొంగ లంచము బట్టి
పొంగుచు మీసలు పెనబెట్టి
యెంగిలైన కాకి కిడబోక తిని క్రొవ్వి
వెంగలి సంపదలం గనువారికి ॥పరమా॥

సంఘ విద్రోహులైన లంచగొండులను గురించి జాలిపడ్డారు. సావిత్రీ చరిత్రలో "మృష్టాన్న మారోగ్య హీనులకుండును. [తినగలవారికి తిండిలేదు" అను లోకమందలి సత్యాన్ని చూపేరు. మరణమంటూ లేకపోతే చేసే పాపాలకు అడ్డే వుండదు కదా.

'మరణభయమే లేకపోయిన
దురితముల కడ్డుండునా?
ధరణియం దన్యాయవాదుల
ధనములకు హద్దుండునా'

అని అతి సహజంగా చెప్పేరు. భారతదేశము ఎంత భ్రష్టమాయెనో యని తెలిసికొని అయినపడిన ఖేదమునకు నిదర్శనమా యనదగిన హరికథామృతములోనిది ఈ రచన.

'వర్ణాః సంకలితాః స్త్రియో విచలితాః
వేదాః పరీభావితాః
గావః క్రూరావిభక్షితాః ఋషిమతం
భూమ్యాం వివిక్తేస్థితమ్
కన్యాశుల్క మపేక్షితం ద్విజగణైః
..................
ధిక్ ధిక్ భారత వర్ష యోగమధునా
కిం వర్ణనీయం మయా'

వీరి హరికథామృతంలో వీరి వచన రచన యపూర్వమనుటకు కుశలవుల రామ కథాగానము నిదర్శనము. 'వల్లెయని అబ్బాలకులు తుమ్మెద రొదలమాడ్కి దంత్రీవాదంబుల మనంబుల హెచ్చరింప, కోయిలలు మ్రోగునట్లు, వెమళ్లగూయు భంగి, తారాజువ్వ లెగయులాగున' అని ఈ రీతిగా సాగినది.

హరిభక్తి ప్రబోధమే వారి ప్రధాన లక్ష్యము. వారి శ్రీహరి కథామృతమందు 'జపహోమ వ్రతాదులచే తెలియరాని పరమేశ్వర మాహాత్మ్యము భక్తిచే తెలియును. మోక్షసాధనము జ్ఞానము. జ్ఞానమునకు భక్తి మూలము' అని ప్రకటించారు. సంసార సాగరమును దాటింపచేసే నౌక హరి భక్తియే.

'హరిభక్తి నౌకయైవ
ప్రకటిత సంసార వారిధిం తరతి,
ఇతరేణ కర్మణాజ్యే
నేవ నరః ప్రజ్వలయతి భవవహ్నిం.'

'హరి రేవ జగ జ్జగ దేవ హరి
ర్హరితో జగతో నహి భిన్నతనుః
ఇతి యస్య మతిః పరమార్థగతిః
స నరో భవ సాగర ముత్తరతి'

హరిని జగదాత్మ స్వరూపునిగా భావించిన భక్తుడు

భవసాగరమును తరించగలడు. హరినామశ్రవణమాత్రం చేత, అవిద్యా అనెడి నిద్రలో సంసారమనే స్వప్నాన్ని గాంచిన జీవుడు, మేల్కాంచుననే తత్వాన్ని చక్కని రూపకాలంకారములు గలిగిన చిన్నశ్లోకములో సుగమముగా చెప్పేరు.

'అవిద్యా నిద్రయా జంతుః
భవస్వప్నం ప్రపశ్యతి
జాగర్తి శ్రీపతే ర్నామ
శ్రవణేన న సంశయః.'

శ్రుతిజ్ఞానాన్ని ఆయన హరికథలలో బోధించేరు.

హరికథా రచనా వైశిష్ట్యము కొంతవరకు చూచేము. హరికథా కథనంతో కూడ వీరిని మించిన వారు లేరు. వీరు మేఘ గంభీరకంఠముతో చేసిన శంఖనినాదము దిగంతాలకి వ్యాపించేది. ప్రేక్షకులంతా మంత్రముగ్ధులై నట్లుండేవారట. ప్రతి హరికథలోను ముందు ధర్మమును బోధించి తరువాత కథ ప్రారంభించేవారు. స్పష్టమైన పాఠ్యము. గంగాప్రవంతిని బోలు ఉపన్యాసము. గంభీరమధుర గాన ప్రసారము. సమున్నత సుందరాకారము. రసపోషణ. సరసమైన హాస్యము—ఇవి వీరి హరికథా కథనమందలి విశిష్ట లక్షణములు. విభావానుభావములను చక్కగా ప్రదర్శించి వాటిచేత స్థాయీభావములను స్ఫురింపజేసి సభ్యులకు శృంగారహాస్యాది రసముల అనుభూతిని కలిగించుటలో వీరికి వీరే సాటి. హనుమంతుడు సముద్రమును దాటే ఘట్టములో సభ్యులకు పారావారమే కళ్లకు కట్టినట్టు ఉండేదట. సభ్యులంతా హరికథను వింటున్నామనే విషయము మరచి, తామే వారిధి దాటినట్లుగనే భావించినంత రసతన్మయత్వం కలిగించేవారట. ఆయన ఆడి, పాడి అభినయిస్తూ ఉంటే ప్రేక్షకుల మనస్సులు ఈ లోకాన్నే మరచేవి. మెళ్లో పూలమాల, చేతిలో చిఱుతాళములు, కాళ్ల గజ్జెలతో హరిదాస వేషం స్పష్టంగా కనిపిస్తూవేవుంటుందికాని వాటిని ప్రేక్షకులు గమనించకుండా వెలికివచ్చే పాత్రలను, భావాలను మాత్రమే గమనించేటట్లు నటించడమే హరిదాసులోని విశిష్టత.

శ్రీ నారాయణదాసుగారి శిష్యులు కూడ కొన్ని హరికథలను రచించేరు. కాని శ్రీ నారాయణదాస విరచితమైన హరికథలే ప్రచారంలో ఉన్నాయి. మొట్టమొదట హరికథలను బహుళ ప్రచారంలోకి తీసుకు రావడంవలన ఈయన హరికథా పితామహుడనే బిరుదు పొందిరి. కవితారసము ననుభవించువారికి కవిత్వము చేతను, సంగీతప్రియులను సంగీతముచేతను, లయకాండ్రను క్లిష్టమగు ముక్తాయింపులతోను, పామరులను చమత్కార వచనములతోను మెప్పించుటలో శ్రీ దాసుగారి యడుగుజాడలలో నడచి, వీరి శిష్యులు, నేటి హరికథాకథకులు హరికథా వాఙ్మయ మభివృద్ధి చెందించవలెను. సంగీత నృత్యకళలందు ప్రావీణ్యము, బహుముఖప్రజ్ఞ, నర్మగర్భ చతురోక్తులు పలుకుట యందు నేర్పు, మొదలగునవి హరిదాసున కుండవలసిన లక్షణములు. హరికథలు మరుగుపడకుండా జనాదరణ పొందునట్లు చూచుట కళాకారుల కర్తవ్యము.

—శ్రీమతి నిష్ఠల పార్వతి.



# లేఖలు

## జంటకవులు - ఒక సంశయము

ఆర్యా!

శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు 1966 సెప్టెంబరు 'భారతి'లో 'తిరుపతికవుల సాహిత్యసమీక్ష' అనే గ్రంథాన్ని విమర్శిస్తూ, ఒక విపులమైన సమీక్ష వ్రాసినారు. అందులోనే శతావధాన సంప్రదాయాన్ని గూర్చియు, జంటకవుల సంప్రదాయాన్ని గూర్చియు వ్రాసిరి. సాహితీజిజ్ఞాసులకు ఎన్నో అమూల్యవిషయాలు తెలుసుకునే అవకాశం-భాగ్యం కలిగించినది వారి వ్యాసము.

ఐతే, వారి పై వ్యాసంలోగల జంటకవుల సంప్రదాయాన్నిగూర్చి ఇటీవల (1966 ఫిబ్రవరి) 'భారతి'లో శ్రీమాన్ ఈయుణ్ణి వీరవెంకటరాఘవాచార్యులవారు 'సంస్కృతసారస్వతమున జంటకవులు' అనే వ్యాసాన్ని ప్రచురించిరి. సంస్కృతాంధ్ర సారస్వత గవేషణమునందు దిగ్గజమైన వీరు శ్రీ నిడుదవోలువారి వ్యాసంలోగల పొరపాట్లు సవరిస్తూ, సంస్కృతాంధ్రాంగ్ల సాహిత్యములలో గల జంటకవులను ఆనుపూర్విగా వెలికితీసి సాహితీలోకానికి ఒక అమూల్యమైన వ్యాసరత్నాన్ని అందించిరి. వీరి వ్యాసమును చదివిన తరువాత, నా యల్పబుద్ధికి ఒండు రెండు సంశయములు కల్గినవి. తన్నివారణార్థమే-ఈ వ్రాత. ఇది విమర్శగాదు.

మొదట-అనగా ఈయుణ్ణివారు వ్రాసిన విషయాన్ని పర్యాలోచించేముందు 1966 సెప్టెంబర్ భారతిలో శ్రీ నిడుదవోలువారు వ్రాసిన విషయము(ల)ను, దానికి శ్రీ ఆచార్యులవారు వ్రాసిన విషయములను తెలిసికొనుట ఎంతేని అవసరము.

'ఈ జంటకవి సంప్రదాయం ఒక్క తెలుగులోనే దప్ప సంస్కృతంలోగాని, ఇతర దేశభాషలలోగాని లేదు. తెలుగులో పదమూడవ శతాబ్దిలో, కాచవిభుడు విఠలరాజు కాలంనుండి ఈ నాటివరకు జంటకవుల సంప్రదాయం వాఙ్మయ చరిత్రలో అవిచ్ఛిన్నంగా అగపడుచున్నదే! నందిమల్లయ్య-ఘంటసింగయ్య, తురగా రామకవి-అయ్యంకి బాలసరస్వతి, కేసన-మల్లన కవులు, అయ్యలరాజు-అయ్యల భాస్కర కవులు, మనకు పరిచితులే. నవీన యుగంలో తిరుపతి వేంకట కవులు జంటకవిత్వాని కొక ప్రత్యేకత సాధించారు. తెలుగులో నవ్యయుగంలో జంటకవయిత్రులు గూడా ఉన్నారు-' ఇది శ్రీ వేంకటరావుగారి వ్రాత. ('భారతి' 1966 సెప్టెంబరు.)

ఇక దీన్ని సవరిస్తూ, విమర్శిస్తూ, శ్రీమాన్ ఈయుణ్ణివారు వ్రాసిన విషయము- "ఆంధ్ర వాఙ్మయమున మొదటి జంటకవులు కాచవిభుడు-విఠలరాజు అని వెంకటరావుగారు వ్రాసియున్నారు. కాని ఇది సరికాదు. ఆంధ్రమున ఆదికవియగు నన్నయభట్టునకు మహాభారత పరివర్తనమున కుడిభుజముగా నుండిన వాఙ్మయ ధురంధరుఁడు, ఆంధ్ర గీర్వాణ కర్ణాటక భాషలయందు మహావిద్వాంసుఁడు, కవికుంజరుఁడు అయిన నారాయణభట్టును - నన్నయభట్టును (క్రీ. శ. 11 శతాబ్దము) తెనుగున మొట్టమొదటి జంటకవులని చెప్పదగును[1]-" అని వ్రాసి, 'సింహావలోకనము'నందు- "ఆంధ్ర సారస్వతమున మొదటి జంటకవులు శ్రీ వేంకటరావుగారు కాచవిభుడు-విఠలరాజు అనుట సరిగాదు. నన్నయభట్టు-నారాయణభట్టులే ఆంధ్ర వాఙ్మయమున తొలి జంట కవులనుట సమంజసము-" (41 పుట) అని సారాంశమును వెలిబుచ్చిరి.

శ్రీమాన్ ఆచార్యులవారి ఈ వ్రాత సాహసోపేతమైనదిగా కనుపట్టుటయే గాక మిక్కిలి విస్మాత్న విషయంతోపాటు బృహత్సంశయాన్ని గూడా కలిగించుచున్నది. ఏమనగా:— మహాభారత పరివర్తనమున నన్నయ్యగారికి నారాయణభట్టు సాహాయ్యంగా ఉన్నట్టు—

'పాయక పాకశాసనికి
భారత ఘోరరణంబునందు నా
రాయణునట్లు [2]వాసిగ థ
రామర వంశ విభూషణుండు నా

---

1. భారతి —1968 ఫిబ్రవరి. 31 పుట.
2. దీనికి పాఠాంతరములు గలవు.

రాయణభట్టు వాఙ్మయ ధు
రంధరుఁడుం దన కిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడునై నవాఁ డభిమ
తంబుగ తోడయి నిర్వహింపఁగన్–'
(ఆదిపర్వము 1–25)

అను ఈ సుప్రసిద్ధమైన పద్యము ప్రబలాధారముగా నున్నది. కావున దీన్నిగూర్చి ప్రథమమున తెలిసి కొందము:

నారాయణభట్టును గూర్చి తెలిసికొనుటకు (1) 'నందంపూడి శాసనము' (1053) (2) ఆంధ్ర మహాభారతమందలి పై పద్యము ఇవి దప్ప వేరుగా ఎట్టి ఆధారములునూ లేవు. భారతమునందు ఈ పద్యమును తీసివేసినను ఎట్టి అవరోధము వాటిల్లదు. అనగా, అచటి పద్యములకు పూర్వాపర విరోధముగాని, విషయక్షతిగాని, మరియెట్టి నష్టము గాని సంభవింపదు గదా? ఇంకొక ముఖ్యవిషయమేమనగా, అప్పకవికి ముందుగల లాక్షణికు లెవ్వరునూ ఈ పద్యాన్ని ఉదాహరింపలేదు. ఇంత ఎందుకు? అప్పకవికి సుమారు ఒక శతాబ్ది కాలము ముందు వాఁడగు ముద్దరాజు రామన తన 'కవిజన సంజీవని' యందు ముప్పావు భాగము మహాభారతంలోనుండి ప్రయోగాలు గైకొనినవాడు. అతఁడీ పద్యం ఊసే ఎత్తలేదు. తరువాతివాడైన అప్పకవి (1656) తన అప్పకవీయంలో 'నిత్యసమాస విశ్రాంతి'కి (నారాయణ శబ్దానికి) ఈ పద్యాన్ని ఉదాహరణగా గైకొనినాడు. ఐతే, అప్పకవికి ముందుగల భారత ప్రతుల్లో ఈ పద్యం ఉండియుండవలయును గదా? నేడు ఉస్మానియా విశ్వవిద్యాలయము (హైదరాబాదు) వారు ఒక బృహత్ప్రణాళిక వేసి ఆంధ్ర మహాభారతమునకు అనేక తాళపత్రప్రతులు, వ్రాతప్రతులు ద్వారా సుపరిష్కృత ముద్రణ సిద్ధముచేయుచున్నారు. వీరివద్ద ఎన్నియెనా ప్రాచీన తాళపత్రప్రతులు గలవు. వాటిలో అప్పకవికి పూర్వప్రతులు ఒకటి రెండు గలవనియు, అందీ పద్యమే లేదనియు తెలియుచున్నది.

నన్నయగారి భారతంలోనుండి అప్పకవి ఉదాహరించిన పద్యాల్లోని పాఠాలు నన్నయవాటి భాషా సంప్రదాయ పద్ధతికే భిన్నంగా ఉన్నవనియు, అతని కవిత్వాన్నిగూడా మరుగుపరచే విధంగా గలవనియు పెద్దల అభిప్రాయము గదా! అయినచో 'పాకశాసనికి–' అనే పద్యం నన్నయభారతంలో గఁదని ప్రబలంగా నమ్మట కవకాశమేది ?[3] అంతేగాక, అప్పకవీయావతారికలో

'మును నారాయణ ధీరుఁడు
తనకు సహాయుఁడుగ సంస్కృతమున వాగను శా
సనుఁడు రచియించె దానిం
దెనిగింపఁగ నీకు దోడు నే విపులగుణున్–'

అని ఆంధ్ర శబ్ద చింతామణి కర్తృత్వ విషయంలో గూడా నన్నయకు నారాయణ భట్టునకు ముడివేసి నా డప్పకవి. నేటికి ఆంధ్ర శబ్ద చింతామణి ప్రతులలో మాత్రము ఇంక నీ విషయము చేరలేదు. అప్పకవి వ్రాసిన ఈ 'కంద' విషయము ఎంతవరకు నిజమైనదో విజ్ఞులు పరిశీలింతురుగాక! దీనినిబట్టి యాలోచింపగా, ముద్దరాజు రామనకు లభింపని 'పాయక పాకశాసనికి–' ఇత్యాది పద్యము అప్పకవి నాటికి అనగా అప్పకవీయ రచనవరకు లాక్షణికంగా స్థానం సంపాదించుకొనుట ఆశ్చర్యకరమేగాక, పై కందము వ్రాసిన యప్పకవి ఈ 'పాయక పాకశాసని–' వ్రాసెనేమో! యను అనుమానమునకు గూడా తావొసంగుచున్నది. అప్పకవీయము వెలువడినప్పటినుండి దాని ననుసరించియే తరువాత గ్రంథ పరిష్కరణ, పాఠభేద పరిశీలనము జరుగుటచే సాహిత్యంలో ఎన్నో ప్రమాదాలకు దారిదీసింది అప్పకవీయం?

మహాభారతమునందు నిత్యసమాస విశ్రాంతులు లేవు గదా? అప్పకవి ఈ పద్యాన్ని మాత్రమే ఉదాహరించడానికి కారణము? కావున ఈ పద్యము నారాయణభట్టును గూర్చి అనగా నన్నయ్య నారాయణ భట్టుల స్నేహం–('జంటకవులు' అని) తెలిసికొనుటకు ప్రామాణికము గాదని నా భావన.

'నందంపూడి శాసనము' మాత్రము, నారాయణభట్టును గూర్చి తెలిసికొనుటకు మిక్కిలిగా

---

3. నేటి కొన్ని ముద్రిత భారత ప్రతుల్లో 'కొన్నిటియందు ఈ పద్యము ప్రక్షిప్తము' అని యుండుట గమనింపదగిన విషయము.

ఉపకరించును. కర్ణాటకవి చరిత్రకారులకుకూడా ఈ శాసనమే నారాయణభట్టు చరిత్ర వ్రాయుటకు ఆధారమైనది. (విస్తర భీతిచే నిందలి విషయమును వ్రాయలేదు. జిజ్ఞాసులు—కర్ణాటకవి చరిత్ర 1 భా 74 పు. చూడుడు.)

ఐనచో ఈ పద్యం ఆధారం గానప్పుడు—శాసనం ఉంది గదా? అది ప్రమాణం గావచ్చు గదా?—అని సంశయము కలుగును. కాని—అది కలగవలసిన సంశయానికి దూరంగా ఉండునేమో! కారణ మేమనగా—ఆ విధంగా 'శాసనాధారం మాత్రమే' గ్రహిస్తే, నన్నయ సమకాలికుఁడు పావులూరి మల్లన గలఁడు గదా? ఆయునది శాసనం గలదు గదా! మరి నన్నయ మల్లనలు జంటకవులు కాగూడదా?

(క) కాగా, నారాయణభట్టును—నన్నయయు జంటకవులే యైనచో నన్నయను స్తుతించిన యనంతర కవులు—అతని కుడిభుజమైన నారాయణభట్టును స్తుతింపక పోవుటయు—

(చ) 'పాయక పాకశాసనికి—' ఇత్యాదిపద్యము ప్రామాణికముగా- అనగా అప్పకవికి ముందునుండియు లేకపోవుటయు (అప్పకవికాలం నుండియే గలదు గావున)—

(ట) ఒక్కశాసనాధారమే మనకు నారాయణ భట్టును గూర్చియు అతని పాండిత్య ప్రకర్షాదుల గూర్చియు తెలిసికొనుటకు ఆధారము గాగలదు కావునను (నన్నయ – నారాయణులు జంట కవులనుటకు ఈ శాసనము సరిపడదని నా యూహ)—

శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్య గూరూత్తములు వ్రాసినట్లు 'నన్నయ నారాయణ భట్టులు తెనుఁగు సారస్వతమున మొట్టమొదటి జంటకవులు' అని భావించుట సమంజసము గాదు అనియు, నేటివరకు మనకు సాధారణంగా లభించిన కాచవిభుఁడు— విఠలనాధులే మొదట జంటకవులనియు నా యూహా వ్రాత. ఇంకను పరిశీలింప విజ్ఞుల కీ విషయమును వదులుచున్నాను.

రెండవ విషయము :—

1966 సెప్టెంబరు 'భారతి' 46 పుటలో— శ్రీ నిడుదవోలువారు మానవల్లి గంగాధరశాస్త్రి గారిని గూర్చి వ్రాయుచు—(శతావధానుల జాబితాలో) 1849—1913 వారి కాలముగా తెలిపిరి. ఈ దీనినే ఫిబ్రవరి 1968 భారతిలో శ్రీ ఆచార్యులవారు వ్రాసిరి. కాని 'మహామహోపాధ్యాయ మానవల్లి గంగాధరశాస్త్రి' అను ఒక అమూల్య వ్యాసంలో వారి కాలాన్ని 1854-1914 అని పేర్కొన్నారు ఈ వ్యాసకర్తలు శ్రీమాన్ ఈ. వేం. వీ. రాఘవాచార్యులవారు. (చూ. 'ఆంధ్రప్రదేశ్' మాసపత్రిక, 1960 డిసెంబర్.)

ఈ పై రెండు తేదీలలో ఏది సరియైనదో తెలియుట సంశయముగా నున్నది. ఇరువురును విద్యారత్నాలు. ఎవరి వ్రాతలోనైనా 'ముద్రారాక్షసులు' చేరిరా?

ఈ పై విషయముల దెలిపి సంశయ నివృత్తి చేయవలసినదిగా మరియొకసారి ఆశించుచున్నాను.

—'విశారద'

## తెలుగు నిఘంటువులలో దేశ్య పదములు

ఆర్యా,

శ్రీ భాగవతము రామారావుగారి 'తెలుగు నిఘంటువులలో దేశ్యపదములపై చిన్నచూపు' అను జనవరి '68 భారతిలోని వ్యాసముచేత ప్రేరేపితులై పలువురు పండితులు ఇంకను కొన్ని పలుకుబళ్లనుచూపియున్నారు. ఇది యెంతయు శ్లాఘింపవలసిన విషయము. ఆ రచయితలు చూపిన పదములకుగల కొన్ని అర్థభేదములను, మరికొన్ని క్రొత్తపదములను నేను చూపుచున్నాను.

'అంట': దీనికి 'కలిపి' 'జంటగా' అను నర్థమున నెల్లూరు మండలములోని దరిశి ప్రాంతమున వాడుక గలదు. 'పాత పీలికలు అంటకుట్టాను' వంటివి.

అంట : 'తగులునట్లు' 'వరకు' అను అర్థమున వాడుదురు. అడుగంటా తుడిచాను.

అధ్వాన్నము : దీనికి శ్రీ జి. శాస్త్రిగారు చెప్పిన అర్థము సరిపోవును. అధ్వాన్నము చతుర్మధ్యంగా

ఉన్నది వా వని అవి వలుకుబడి వెల్లూరుజిల్లాలో గలదు.

ఇగురం: ఇగురం అనే మాట బహుశః 'వేగిరంకు'కు అపభ్రంశరూపము కావచ్చును. కానీ వివరం అనే దానికి అపభ్రంశము కాజాలదు. 'ఇవరం' 'వివర'మనే దానికి అపభ్రంశము. 'ఇవరం సవరం లేదు వాడికి' అంటాడు.

ఉమ్మగిల్లు: శ్రీ శాస్త్రిగారు ఉమ్మరమునకు ఉక్కపోయు అనే అర్థము చెప్పారు. అన్నం ఉమ్మగిల్లిందా? అంటారు. అంటే నీటి ఆవిరితగ్గి కొంత చల్లబడటమన్న అర్థంలో వాడుక ఉన్నది.

అబ్బరము: ఆశ్చర్యము అను అర్థములో వాడుతారు. ఏమి అబ్బరమమ్మా! ఆ మాత్రం మొయ్యలేదు అంటారు. ఇది అబ్బురమునకు రూపాంతరము.

గూసులాడు: తెలంగాణములో పోట్లాడు అను అర్థములోవాడబడును—వాళ్ళు గూసులాడుకుంటున్నారు. ఇది ముష్టిఘాతార్థకమైన 'ఘూస్' అనే హిందీ పదాపభ్రంశమై యుండును.

ఎటమటము: బహుశః రెట్టమతమునుంచి వచ్చి యుండవచ్చును.

కడమ: మిగిలినదనియేకాక, చివరిదనియు అర్థము గలదు.

కూడు-కుమ్ము: ఇది సరియైన ప్రయోగం కాదని, కూడూ కుంభము సరియైనదని శ్రీ శాస్త్రి గారు వ్రాశారు. ఐనా కూడూ—కుమ్మూ లేకుండా ఏమిటా ఆటలు?—అని వెల్లూరుజిల్లా ప్రయోగము. కూడు—చేరు, గుమిగూడు అని అర్థం వుందికదా? కుమ్ముకు పొడుచు అను అర్థము గలదు.

ఇగ్గుట: కేవలమిది తెలంగాణా ప్రయోగమే కాదు వినుకొండనుంచి గిద్దలూరువరకుగల ప్రాంతమందుమ లాగు, వదులు అను రెండర్థములందును వాడబడును.

ఒరయు: ఒరుసుక పోవు అనునది సర్కారు జిల్లాలందును వాడుకలో గలదు.

ఎంచు: లెక్కించు అను అర్థములో కడప ప్రాంతమునందును, దరిశి మార్కాపురం ప్రాంతములందును వాడబడును.

కచ్చరము: దీనినే కచ్చడము అని కొన్ని ప్రాంతములందు ఇదే అర్థముతో వాడుదురు. చిన్నయ సూరి వాడిన కంచరమున కిది అపభ్రంశమా?

కలియామాకు: కరివేము ఆకు అనుదానికి పూర్తిగా అపభ్రంశరూపము. (ర, ల లకు పోలిక సహజమే గదా.) తెలంగాణమున 'కరివేము' అను వలుకుబడి 'కరివేప'కుచెట్లకు ఉండియుండవచ్చును.

కల్వము: ఇది అన్నిచోట్ల ఇదే అర్థములో వాడబడుచున్నది. దీని వికృతి కలువము.

తలుగు: ఇదే అర్థములో వెల్లూరు మండలమందు వాడబడును. తాళ్ళు—తలుగులు.

తమ్మె: ఇదియు పశువుల మెడకు వేయు త్రాడు, వెల్లూరుజిల్లా పదము.

నీలమోర: పశువుల (ఎద్దులు, దున్నలు) మూతికివేయు ఒక రకమైన త్రాడు. నెల్లూరుజిల్లా ప్రయోగము.

తమ్మళి: వెల్లూరుజిల్లాలో ఇదే అర్థమున తంబళి అందురు. ఆడపెత్తనం—తంబళి దొరతనం, తంబళివేషాలు మొద.

తంతె: బహుశః దంతెనుండి వచ్చియుండవచ్చును.

దూపు: దప్పిక. ఇది 'ధూప్' అను ఉరూ శబ్దజన్యము. తెలంగాణముననే వాడబడును.

దొడ్డు: లావు. ఇది రాయలసీమలోను ఇదే అర్థములో వాడబడును.

పునుగులు: 'పుణుకులు'కు అపభ్రంశము. సర్కారుజిల్లాలలో బహుళ ప్రచారమందుగల ఒక పిండివంట.

మణుగుబూలు: జంతికలను రాయలసీమ, నెల్లూరుజిల్లాలలో ఈ పేరుతో వ్యవహరింతురు.

మురుకులు: జంతికలలో కొద్ది లావుపాటి వానిని ముక్కలుచేసి తెలంగాణములందు మురుకులందురు, అన్నిహోటళ్లలోను లభించును.

పుట్నాలు : కందిపుట్నాలని, వేయించిన కందులను నెల్లూరు మండలమందు పిలుతురు.

అ్రరు : మూల అనే అర్థం. అ్రరుతిరుకు, అ్రరుతిప్పు అని నెల్లూరుజిల్లాలో వాడుదురు.

మొల : మేకు. తెలంగాణాలో బహుళ ప్రచారమునందిన దీ పదము. గోడకు మొలగొట్టు. తల గొట్టి మొలవేయు—నందలి మొల ఇదియే.

రంధి : ఆత్రుత అను అర్థములో గలదు. అంత రంధి ఎందుకు? పోరుపెట్టు అను అర్థమున వాడబడును. 'కూచున్న గుడ్డి మామగారూ నమస్కారమయ్యా అంటే, రంధికి మొదలే రంకుల కోడలా! అన్నాట్ట.' అని నెల్లూరుజిల్లాలో వాడుక సామెత గలదు.

జోకు : తూనిక తూయు అని అర్థములో వాడబడును. కిలో శక్కర జోకు. ఇది తెలంగాణ్యపు ప్రయోగము.

అండాలు : పెద్దపాత్రలు. హొండీ అనే ఉరుదూ పదంనుంచి వచ్చిఉండవచ్చు. తెలంగాణాలోనే బహుళ ప్రయోగంలోఉన్నా నర్కారుజిల్లాల్లోనూ కన్పిస్తుంది ఈ పదం వాడుక.

పాను : తెలంగాణాలో 'కిళ్లీ' అనే అర్థంలో వాడుక. ఉర్దూలోని 'పాన్'నుంచి వచ్చినది. కానీ 'అను పానులు' తెలుసుకున్నాడని లోతుపాతులనే అర్థంలో 'పాను' అనే మాట వాడ్తారు సర్కారుజిల్లాల్లో. అదివేరు.

తట్ట : కంచము. ఇది కడప ప్రాంతములో వాడుదురు.

మెట్లు : చెప్పులు. ఇదీ కడప ప్రాంతపుపదమే.

చీడీలు : సోపానములు. ఇదియును కడప ప్రాంతపు పదమే. 'సీఢీ'యను పారశీక పదజన్యము గావచ్చును. తెలంగాణములో 'సీఢీ'లని వాడుదురు.

చిత్త : నంచి. ఇదియు కడప ప్రాంతపుపదమే.

నబ్బుబియ్యం : సర్కారుసీమలో వీనినే నగ్గుబియ్యం అని వాడుదురు.

తిరగమాత : తిరుగమూత (తిరుగవేత) యను దాని అపభ్రంశరూపము. నెల్లూరుజిల్లా పలుకుబడి.

ఇందనక : సర్కారు ప్రాంతమున 'ఇందాక' అనుపదమునకు నెల్లూరుజిల్లా ప్రయోగము. 'ఇంతదనుక'కు వికృతి.

శరవ : ఇత్తడిపాత్ర. 'శరవలు చెంబులు తోము'—అని నెల్లూరుజిల్లా, కర్నూలుజిల్లాల ప్రయోగము.

జోరా : గొంగళివంటిది. పరచుకొని, పడుకొనుటకు వాడు మందమైన వస్త్రము. నెల్లూరు జిల్లా ప్రయోగము.

పేలిక : 'పీలిక'కు వికృతి. గుడ్డపేలికలు బొత్తిగా లేవు. నెల్లూరుజిల్లా ప్రయోగము.

అంకణము : ఇంటిలోని ఒక భాగము. ఇల్లు పరిమాణము చెప్పుటకు వాడుమానము. వాడిది నాలుగు అంకణాల ఇల్లు.

మబ్బు : తెలంగాణమునందు తెల్లవారు ఝామున లేక (ప్రొద్దుటే) అను అర్థమున వాడుదురు. మబ్బులోనే లే!

మొగులు : మేఘము. తెలంగాణాపదము.

తెల్లనిదాకా : తెల్లవారువరకు. తెలంగాణాలో వరంగల్లు ప్రాంతపదము. వాడు తెల్లనిదాకా పని చేస్తాడు. తెల్లవారినదాక సంగ్రహరూపము.

ఒగారింపు : తాలింపువేయు అను అర్థమున తెలంగాణమునందు వాడుదురు.

పొణక } పోటి } : దీనికినిప్పై అర్థమే తెలంగాణమున వాడబడును. కొన్ని ప్రాంతములందు "ధాన్యముపోయుగాదె అను అర్థముగలదని వింటిని.

పెయ్యి } మెయ్యి } : దేహము అను అర్థమున తెలంగాణమున వాడబడును. వాడు పెయ్యి గడిగినడా? (వాడు స్నానం చేశాడా?) మెయి రూపాంతరము.

గ్రాసము : తినుపదార్థమని తెలంగాణా పలుకుబడి. సైదారా! తింటానికి గ్రాసం లేదు.

బొఱ్ఱు : బెజ్జము. గోదావరి మండలము లందలి ప్రయోగము. బొఱియ రూపాంతరము.

లెక్క : డబ్బు. ఇది అన్నిప్రాంతములందును కొందరచే ఈ అర్థమున వాడబడును. లెక్క ఏమన్నా ఉందిరా?

లెక్కాచారము : లెక్కవేయు, గుణించు. లెక్కాచారం కట్టావా నా డబ్బులకు? అని కడప ప్రాంత ప్రయోగము.

టుట్టుటుట్టు మోటరు : మోటారుసైకిలు.

అంతరాల మోటరు : విమానము. ఇవి రెండును తెలంగాణా ప్రయోగములు.

ఇచ్చట కొన్ని మాత్రమే దిఙ్మాత్రముగా చూపబడినవి. తెలంగాణమునందలి కొన్ని పలుకుబళ్ళు ఆదే అర్థముతో రాయలసీమయందును, నెల్లూరు జిల్లాయందును నేటికిని పల్లెలలో నిలిచియున్నవి. ఇట్టివి నశించిన పలుకుబళ్ళు ఎన్నో ఆంధ్రమున యుండియుండవచ్చును. ఆంధ్రదేశమున విస్తృత మైన పరిధిలో ఇట్టివానిని సేకరించి నిఘంటువు లందు వాని అర్హతనుబట్టి ఎక్కించిన, వానికి సముచిత స్థానము నిచ్చి గౌరవించినవార మగుదుము. ఇవి ఆయా కవులచేత ఉపయోగింపబడిన వానికి కవి ప్రయోగ ప్రామాణ్యమును లభించును. భాషకు పుష్టితుష్టి చేకూరును. లభించినంతవరకు ఈ వ్యాసమునందు పొందుపరిచితిని. మరియొకమారు పాఠకులకు ఇంక కొన్ని నిరుకపరచగలను.

—ఆవంచ సత్యనారాయణ.

## పెద్దదూగాం శాసనం

ఆర్యా,

ఫిబ్రవరినెల భారతిలో శ్రీ కట్టీ సాంబమూర్తి శాస్త్రిగారి వ్యాసము 'పెద్దదూగాం శాసనము'లో 'కాళిదాసు సముద్రగుప్తుని యాస్థానకవియైనను గాకున్నను (ఈతని సమకాలికుడనుట) కెట్టి యభ్యం తరములేదు గదా' యని ప్రసంగవశమున నుడివిన మాట నన్ను ప్రేరేపించినది. సరిగా గత సంవత్స రము ఫిబ్రవరి 1967 భారతిలో దొల్లాపిప్ప వాసుదేవశాస్త్రిగారి వ్యాసము 'సముద్రగుప్తుని కృష్ణ చరితము'ను గూర్చి వచ్చినది. దానిలో సముద్ర గుప్తుడు పూర్వకవులను ప్రస్తుతించుచూ శూద్ర కుని స్మరించి యాతడే శకారి, విక్రమాదిత్యుడనియు నాతని యాస్థానమున మహాకవి కాళిదాసు విరాజిల్లె ననియు స్పష్టము జేసెను. ఆ వ్యాసములో ముద్రిత మైన కృష్ణచరితములోని శ్లోకములను గొన్నిటిని యథాతథముగా నిచ్చుచున్నాను.

'పురందరబలో విప
శూద్రక శ్శస్త్రశాస్త్రవిత్
ధనుర్వేదం చౌర శాస్త్రం
రూపకే ద్వే తథా కరోత్.'

భూయస్స మృచ్ఛకటికం
సవాంకం నాటకం వ్యధాత్
తస్యా భవ స్సరపతేః కవి రాస్త్వపర్ణః
శ్రీ కాళిదాస ఇతి యోఽప్రతిమ ప్రభావః
దుష్యన్త భూపతి కథాం ప్రణయ ప్రతిష్ఠాం
రమ్యాభివేయ భరితాం సరసాం చకార.
శాకుంతలేన సకవిః
నాటకేనాప్తవాన్ యశః'

దీనిబట్టి మహాకవి కాళిదాసు సమయము వివాద గ్రస్తమనుమాట తొలగిపోయినది.

'సత్సరం స శకాన్ జిత్వా
ప్రావర్తయత వై క్రమమ్.'

అనుటచే విక్రమార్క శకము నిర్ధారితమైనది. చరిత్ర కారుల నిర్ణయ ప్రకారము క్రీ. పూ. రెండవ శతాబ్దము నుండి శకులదాడి యారబ్ధమయినది. శకులను జయిం చిన నాటినుండి విక్రమార్క శకము మొదలయినది. కాగా నది క్రీ. పూ. 57 సం॥మొదలుకొని యిూ నాటికి వ్యాప్తిలోనున్నది. ఈ శకారంభమునకు పూర్వమే శూద్రకుడుండెను గావున క్రీ. పూ. రెండవ శతాబ్ది యాఖరులో నతనితోబాటు మహాకవి కాళిదాసుకూడ నుండెననుట సమంజసము.

మాళవికాగ్ని మిత్రములో భరతవాక్యముబట్టి కాళిదాస మహాకవి అగ్నిమిత్రుని సమకాలీనుడని యుప పత్తి కలిగినది. అగ్నిమిత్రుడు పుష్యమిత్రుని కుమారుడుగావున క్రీ. పూ. రెండవశతాబ్దివాడని సాక్ష్యము (మహాభాష్యము, చరిత్ర) దొరికినది.

మఱియు వా యగ్నిమిత్రుడు శూద్రకుడే యని కీర్తిశేషులు ఆచార్య కున్‌హన్ రాజాగారు వారి Survey of Sanskrit Literature అను గ్రంథములో వ్రాసియున్నారు.

మఱియు మల్లాది సూర్యనారాయణశాస్త్రి తమ సంస్కృత కవి జీవితము అను గ్రంథమున కాళిదాసుని క్రీస్తు పూర్వమున ధ్రువీకరించుచు నీ క్రింది వాక్యము నుదాహరించినారు.

"అలహాబాదు నగరమునకు దగ్గ అగామన్న భీత నామక గ్రామమున మార్షలు పండితుడు సంపాదించిన పురాతన లోహపు రేకులలో దుష్యంతుడు లేడిని తఱుముట మొదలుగాగల శాకుంతల నాటక ప్రథమాంక కథ చెక్కబడినది. ఆరేకులు క్రీ. పూ. 185—73 నడుమ పాలకులుగా నున్న సంగరాజుల కాలమునకు సంబంధించినవని రమేష్ మోహన్‌బోసు గారు శాకుంతల పీఠికలో పరిశోధకుల యభిప్రాయము నుట్టంకించినారు."

దీనినిబట్టి, మౌర్యసామ్రాజ్యపతన కారకుడైనది పుష్యమిత్ర శుంగుడు అనియు, నతనికుమారుడు విక్రమార్కుడు (శూద్రకుడు) ఉజ్జయినిలో నివసించుటయు నాతడే విదిశలో రాజగుటయు వానితో స్థిరసంపర్కముగల మహాకవి యాయానగరముల ప్రీతిమై కావ్యములలో వర్ణించుటయు జూడగా మగధ దేశమునుండి వచ్చి మహాకవి మధ్యప్రదేశమున బాగుగా సంచరించినట్లు ద్యోతితమయినది. విక్రమాంకముగా విక్రమోర్వశీయమును నాతడే రచించుటయు విక్రమార్కుని (శూద్రకుని) యాస్థానమున మహాకవిస్థానమును బలపరచుచున్నది.

పాణినీయము మహాభాష్య ముఖముగా పరిపుష్టము పరిష్కృతమునగు నాదినములలో కాళిదాస కావ్యములలో నపాణినీయ ప్రయోగములు కొలది కన్పట్టుట, నవియు నితరవ్యాకరణములచే సాధువు లగుటయు దీని కుపోద్బలకముగా నున్నది.

ఇవి యన్నియు నిట్లుండ విచ్ఛాపూర్వకముగ మాక్స్‌ముల్లర్ కీత్ పండితులు మహాకవి సమయమును క్రీ. శ. 6 వ శతాబ్దివరకు దిగలాగుట సంభవించినది. వీనిని సోపపత్తికముగ మాక్డనాలు మహాశయుడు ఖండించినాడు. ఫ్లీట్‌మహాశయుని పరిశోధనము ఫెర్గూసన్‌గారి వాదమును భంగపఱచినది. ఈ విషయముల నుదాహరించినచో ప్రస్తుత లేఖయే ఒక వ్యాసము కాగలదను భీతిచే విరమించుచు తుదిపలుకుగా నీ క్రింది విన్నపము చేసికొనుచున్నాము.

సంవత్సరము క్రితము వెలుగులోనికి వచ్చిన సముద్రగుప్తుని కృష్ణచరితము, దానిచే నిర్ధారణ చేయబడిన మహాకవి కాళిదాసుకాలము అనాలోచితముగా నిలచిపోయినవి. ఇది యెంతయు ఖేదావహము. ఒక ప్రబలమయిన యాధారము లభించినపుడు సాహిత్య చరిత్రకారులు దానిని భద్రపఱచి ప్రకాశమునకు తీసికొని రావలయును అది జరుగలేదు. సంవత్సరము క్రితము నీ కృష్ణచరిత వ్యాసమును జూచి యిక పండితుల వాదవివాదములు అణగి కాళిదాస సమయ స్థిరీకరణ సంభవించునని యూహించితిని. అది జరుగలేదు. అతి ప్రముఖ మహాకవి కాళిదాసుని విషయములో పండితు లింత యశ్రద్ధ వహించుటచే భారతీయులకు చారిత్రక దృష్టి లేదను పాశ్చాత్యుల ముందు తలవంచుకొనక తప్పదని రుజావగుచున్నది.

—వి. ఏ. కుమారస్వామి.

## శ్రీ రాజారామ్ సాహితీవ్యాసంగం

అర్యా!

ఫిబ్రవరి '68 'భారతి' మాస పత్రికలో 'శ్రీ మధురాంతకం రాజారాం సాహితీ వ్యాసంగం' అన్న వ్యాసం చదివినతరువాత ఈ క్రింది వాక్యాలు వ్రాయాలనిపిస్తోంది. పై వ్యాసంలో ఒకటి, రెండుచోట్ల ఆ వ్యాసరచయిత వ్యక్తీకరించిన అభిప్రాయాలతోటి నేను ఏకీభవించలేకపోయినప్పటికీ తోటి కథారచయిత మీద విమర్శనాత్మకమైన సమీక్ష చేసినందుకు శ్రీ కొలకలూరి ని అభినందించకుండా ఉండలేను. శ్రీ రాజారాం కథలపై ని ఆంగ్లకథానికా ప్రభావం లేదని చెప్తూ వ్రాసిన వాక్యాలు మాటికి నూరు

పాళ్ళ నిజం! ఈ విధంగా ఆంగ్ల కథానికా ప్రభావానికి గురికాకుండా, తెలిసో, తెలియకో, రచనలు చేసిన, చెయ్యగలిగిన రచయితలు తెలుగు కథానికా ప్రపంచంలో ఎంతమంది ఉన్నారు?—అన్న ప్రశ్నకు ఆలోచనాపరులైన పాఠకులు సమాధానం వెతుక్కోవలసిందే!

ఏ 'తాను వెలిగించిన దీపాలు' కథానికా సంపుటానికి ఈ ఏడాది ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ ఉత్తమ కథానికా సంపుటిగా నిర్ణయించి బహుమతి ఇచ్చిందో ఆ పుస్తకాన్నే ప్రశంసిస్తూ 'తాను వెలిగించిన దీపాలు నిజముగా కథాశాఖలో ఒక మణిదీపము' అన్నారు ప్రముఖ విమర్శకుడు శ్రీ తూమాటి దోణప్ప. 'ఈ సంపుటిలోని మూడు కథలూ మూడు ముత్యాలవంటివి' అని భారతిలో సమీక్షచేసిన ప్రముఖ సాహిత్య విమర్శకుడు శ్రీ శ్రీవాత్సవ వేరొక వారపత్రికలో ఇదే పుస్తకాన్ని సమీక్షచేస్తూ ఇన్ని ఉత్తమకథలు వ్రాసిన ఆ రచయితను పరిచయం చేస్తూ 'నిజం నిష్ఠురమైనా చెప్పగలిగిన నిరాడంబరమైన నిష్పార్థ రచయిత రాజారాం అనే రాయలసీమవాసి' అన్నారు. శ్రీ రాజారాం రాయలసీమవాసి అయినా, ఆయన కథల్లో తిమ్మసముద్రం, రామాపురంవంటి స్థలాలనే పాఠకులు దర్శించినా, ఆ రచయిత భావాలు రాయలసీమకే పరిమితాలు కావు. ఆ కథలలోని పాత్రల మనోభావాల వెనుక విశాల వసుధనే చుంబించే దృష్టిని ఎవరైనా గుర్తుపట్టగలరు!

శ్రీ మధురాంతకం రాజారాం ముఖ్యంగా కథానికా రచయిత. ఈ విషయాన్ని పై వ్యాసరచయిత కూడ చెప్పారు. అతని మొత్తం కథానికలు సమీక్ష చేస్తూ కొన్ని అనుపమానమైన కథానికలను పై వ్యాసరచయిత ఏ కారణంచేతనో పేర్కొనలేదు. ఆ కథలు ఇవి: 'వ్యస్తాక్షరి', 'పునర్నవం', 'అంగరక్షకుడు', 'కమ్మతెమ్మెర', 'తలుపులు—తాళాలు', 'ఒకేకాడ—రెండు పువ్వులు', 'ధర్మగ్లాని', మరియు 'మేలు చేసినవాడు.'

1958 లో 'జాగృతి' పత్రిక నిర్వహించిన దీపావళి కథల పోటీలో ప్రథమ బహుమతి లభించిన 'వ్యస్తాక్షరి' కథానికను 1959 లో 'స్వతంత్ర' పత్రికలో 'సాహిత్య సింహావలోకనం' చేస్తూ ప్రత్యేకంగా చెప్పుకోదగ్గ కథానికగా శ్రీ శ్రీవాత్సవ పేర్కొన్నారు. పై కథానికలో ప్రతి ఒక్క మాట రచయిత తూచివాడినట్టు తెలుస్తుంది. శేఖరం భార్య పోయిందన్న వార్త తెలిసినతర్వాత అతనిని పరామర్శించటంకోసం వెళ్ళిన రాజు 'బారెడు పొడుగు నిజం ఇవ్వలేని మహదర్థాన్ని ఒక చిన్నఅబద్ధం ఇవ్వగలిగినట్లయితే ఆ అబద్ధాన్ని నిస్సంకోచంగా వాడుకోవచ్చునన్న నిర్ణయానికి వేనా రాత్రంతా ఆలోచించవలసివచ్చింది.' అంటాడు కథ చివరిలో. కథాసాహిత్యంలో ఈ కథ ఒక మణిపూసలాంటిది.

శ్రీ రాజారాం కథలలో ప్రముఖంగా కనిపించే విషయ మేమిటంటే పెద్దల మాటలు సహజమైన పద్ధతిలో, సందర్భానుసారంగా ఉల్లేఖించబడతాయి. అవసరానుగుణ్యంగా మహాత్ముల వచనాల్ని మనం మననం చేసుకోకపోతే వాళ్ళ పవిత్రస్మృతికి మహాపచారం చేసినవాళ్ళం అవుతామేమో! కథల్నే ఒక సాధనంగా ఎందుకు వాడుకోవాలి అని కొందరు అభిప్రాయపడవచ్చును. కథలు నూటికి ముప్పాతిక కల్పనతో కూడుకొన్నవయినా ఆ పాత్రల నోటినుండి వచ్చే వాక్యాలు శక్తిని కూర్చుకుంటాయి అని అందరూ అంగీకరిస్తారు. కొన్నిచోట్ల రచయిత తన భావాలనుకూడ కొత్త ఆలోచనల్ని రేకెత్తే విధంగా జోడించి వ్రాస్తారు. ఉదాహరణకు ఈ క్రింది వాక్యం చదవండి:

'రజ్జు సర్పభ్రాంతి అయితే చింతేలేదు. కాని లోకంలో రజ్జు సర్పభ్రాంతులతోపాటు సర్పాన్ని రజ్జు అనుకొనే భ్రాంతులుగూడా దండిగానే ఉన్న మాటను ఎలా కాదనగలము?' (అవశేషం).

స్త్రీల సమస్యలను స్త్రీలు మాత్రమే నిష్పక్షపాతంగా ఆలోచించగలరన్న భావన ఈవాడు

వస్తున్న కొంతమంది రచయిత్రుల రచనలలో స్పష్టంగా గోచరిస్తుంది. ఇది చాల దురదృష్టకరమైన విషయం. ఎందుచేతనంటే కొన్ని పురుష ద్వేషంతో కూడుకొన్నవయి ఈ రచనలు పాఠకుల ఎదుట సాక్షాత్కరిస్తుంటాయి. పైగా రచయితలలో నైతేనేమి, సంఘ సంస్కర్తలలో నైతేనేమి స్త్రీల మంచి చెడ్డల విషయంలో పలుకాలాల్లో, పలుతావుల్లో పురుషులే ముందంజ వేసిన సత్యాన్ని ఎలా విస్మరించగలం? ఈ సందర్భంలో శ్రీ మధురాంతకం రాజారాం 'పునర్నవం' కథలోని 'లక్ష్మి' పాత్రను ప్రత్యేకంగా చెప్పుకోవాలి ఇక్కడ. వివాహంనాడు పాదాలకు రాసుకొన్న పారాణి తడి అయినా ఆరక మునుపే తన భర్తను కోల్పోయి సూర్యోదయం సూర్యాస్తమయంగా పరిణమించిన 'లక్ష్మి' జీవితంలో చిట్టచివరకు సూర్యోదయమే అవుతుంది! అత్యంత కరుణామయమైన ఈ పాత్ర ఎటువంటి కఠిన హృదయులనైనా కలచివేస్తుంది. 'ఏ చాప క్రిందికి నీళ్ళు తెద్దామా అన్న ఆలోచన తప్పితే మరొక ధ్యాస లేని, ఎడారి వెంట ప్రసరించే బుద్ధులు కల శంకరాలు, లక్ష్మి వంటి భాగ్యహీనులైన సోదరీమణులు మన దేశంలో ఎంతమందో కదా! అన్ని కష్టాలూ గట్టెక్కి చిట్టచివరికైనా 'లక్ష్మి' లా సుఖప్రదమైన జీవితానికి నోచుకోగలవారు యెంత మంది ?—అన్న ప్రశ్న సవాలు చేస్తుంది కథ చదివిన తర్వాత. సరిగ్గా యిక్కడే రచయిత తన రచనా వ్యాసంగంలోంచి ఒక సంస్కర్తగా ఎదురవుతాడు. సభావేదికపైనుండి యివ్వబడిన ఉపన్యాసాలకన్నా ఒక రచయిత సృష్టించిన అటువంటి పాత్రలు, వాటి పాత్రపోషణ అధిక ప్రభావాన్ని తెచ్చేవి, ప్రయోజనమైనవీ అని అనడం అతిశయోక్తి కాదనుకుంటాను.

'కమ్మ తెమ్మెర' ఒకవిధంగా కథ కాదు — చక్కని వచన కవిత్వం! 'అంగరక్షకుడు' స్కూలు ఫైనలు విద్యార్థుల పరీక్షల్లో వాచర్లుగా వెళ్ళే ఉపాధ్యాయుల కష్టసుఖాలు అతి వ్యంగ్యంగా చెప్పే కథ. ఆకాశవాణి సాహిత్య సంచిక కార్యక్రమంలో రచయితద్వారా చదవబడిన 'తలుపులు – తాళాలు' మానవుడు నాగరికత పేరుతో ఎంత కపటంగా తయారవుతున్నాడో ఈ కథ చెప్తుంది. 'మానవ నాగరికతా చరిత్రలో గృహనిర్మాణదశ ఒక అతి ముఖ్యమైన ఘట్టమే కావచ్చు. కాని ఆ ఘట్టంలోనే మనిషికి మనిషిపైన అవిశ్వాసం బయలుదేరి ఉంటుందని నా అనుమానం' అన్నది పై కథలోని చక్కని వాక్యం. 'ధర్మగ్లాని' రచయితల సాధక బాధకాలు ముఖ్యంగా పుస్తక ప్రచురణకర్తలకు సంబంధించి చెప్పే కథ. అందులో ఈనాడు చవుకబారు సాహిత్యం పై పై మెరుగులతో ఏవిధంగా చెల్లిపోతున్నదో అర్థోక్తిగా చెపుతుంది. ఇటువంటి కథను ప్రచురించిన 'భారతి' మాసపత్రికను ముఖ్యంగా అభినందించాలి. 'వ్రాసి ముగించి రచనను పోస్టుచేయడం వరకు మాత్రమే తనవంతు అనుకునేవాడు వ్యాసమూర్తి. ఆతరువాత దాని జాతకాన్ని నిర్ణయించేవాడు తాను గాడు. తపాలశాఖవారు దాన్ని పరామర్శిస్తారు. సంపాదకులు పరిశీలిస్తారు. ప్రూఫ్ రీడర్లు అక్షరక్షరంగా శోధిస్తారు. తరువాత మ్యాన్ఏజెంట్లుస్పర్శిస్తారు... చిట్టచివర మహాభారతాన్ని గానివ్వు, మందుల కేటలాగును గానివ్వు సమదృష్టితో చూడగలిగిన చిల్లర కొట్టు వర్తకులు దాన్ని చించి పొట్లాలు కడతారు' అన్న వాక్యం ఉత్తమ సాహిత్యానికి పట్టే దుర్గతిని వ్యంగ్యంగా చెబుతుంది. ఈ కథలో రెక్కమాను ఉపమానంగా ఈనాడు సాహితీ విలువలు ఏ విధంగా తారుమారయ్యాయో చెప్పిన తీరు ఈనాటి సాహిత్య దుస్థితికి దర్పణం లాంటిది.

ఆర్థిక పరిస్థితులు మనుషులపైన ఏ విధమైన ప్రభావం తీసుకు రాగలవో చెప్తూ 'ఒకే కాడ— రెండు పువ్వులు'లో ఒక చోట ఈనాడు నగరాల్లో భవన నిర్మాణం ఎంత విచిత్ర రీతుల్లో కొనసాగుతుందో కూడ చెపుతారు. మనిషి తన ఆలోచనకి తగిన భవన నిర్మాణం చేసేవాడు పూర్వపు రోజుల్లో. ఇప్పుడలా కాదు. ఎంత విచిత్రమైన స్థలమైనా అవసరం కొద్దీ ఏదో ఒక రీతిలో నివ

పించడానికి వీలుగా ఇళ్లు కడుతున్నారిప్పుడు! 'మేలు చేసినవాడు' కథలో 'ఓహో, అదా, ఆ వివరం మాకు తెలియదు. మా అయ్యగారే ఒకసారి చెప్పారు. ఎప్పుడోగాని ఆయనగారు మీా అయ్యగారికి గొప్ప సాయం చేశాడట!' అని కొట్టు కుర్రవాడు ఇచ్చిన సమాధానం 'ఓడలు బండ్లవును, బండ్లు ఓడ లవును' అన్న సామెతను రుజూపరుస్తూ అపకారికి కూడ ఉపకారం తలపెట్టగల రంగస్వాములు లోకంలో ఉండగలరా? ఉన్నారా? అన్న ప్రశ్నతో ముగుస్తుంది.

శ్రీ మధురాంతకం రాజారాం కథారచనను సాహిత్య తపస్సుగా స్వీకరించిన వ్యక్తి. ప్రారంభంలో కొన్ని గేయాలు తప్పితే, ఈ రచయిత తనకున్న పేరుతో ఇతర సాహిత్యప్రక్రియలలోకి అడుగుపెట్టిన వ్యక్తి కాదు.

'బలకమాడిన "నిశామిళితవారి" ఒడలిపసిమికి మిసిమి తేగా మెడలోని పసుపు బొందుగళరేఖ విన్నుమడింపగా తెలినవ్వు వెల్లువంతో మనుమల, మనుమలాండ్ర కోడిగముచేయు ముసలి ముత్తైదువు మన భారతీయ సంస్కృతి' అని ఒక ప్రముఖ భాషాపరిశోధకుడు అంటే, అటువంటి సంస్కృతికి శ్రీ రాజారాం కథలు ప్రతిబింబాలే అని చెప్పుకోవాలి! ప్రగతి శీలుడు, సాహిత్యతపస్వి అయిన శ్రీ మధురాంతకం రాజారాం లేఖినినుండి ఇంకా చక్కని రచనలు వెలువడగలవని ఆశిస్తూ, ఎన్నో ఉన్నత బహుమతులను పొందాలని కోరుతున్నాను. ఇదే సహృదయ పాఠకులంతా కోరేది.

— పరిమి సాంబశివరావు.



# గ్రంథ విమర్శలు

## మనసులూ-మర్మాలూ

[కథలు: రచన : శ్రీ వరిగొండ రామచంద్ర రావు, ప్రతులకు : పోతుకూచి ఏజన్సీస్, 208 న్యూబోయిగూడ, సికింద్రాబాదు. 143 పేజీలు; వెల రూ. 2–50.]

ఏ రసానుభూతినీ కలిగించకుండ ముద్రణ యంత్రపు ఆకలిని తీర్చటానికీ, పత్రికలలో పేజీలు నిండటానికీ కొన్ని కథలు ప్రచురింపబడుతున్నాయి. ఆ ప్రచురింపబడిన కథలు పెక్కు సంపుటాలుగా కుప్పతెప్పలుగా వస్తున్నాయి. అటువంటి కథా సంపుటాలలో 'మనసులూ, మర్మాలూ'గూడా నొకటి. ఇందులోని పదునొకండు కథలలో ఏ కథా ఆనందింప జేసేదిగా లేదు. ఏ కథలోనూ మనస్సులోని మర్మాలను వెలికితీసే అంతరంగ పరిశీలనం లేదు. అయినా గోలకొండ పత్రికలో యీ కథలు ప్రచురింపబడి సంపుటంగా శ్రీ కె. రాజయ్యగారి అందమైన ముఖ చిత్రంతో అలంకరించుకొని ముస్తాబై వచ్చాయి.

ఈ సంపుటిలోని కథలు శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు నేటి తెలుగు కథానికల గూర్చి 'రచయిత మనసూ, నేను చెప్పిన మర్మమూ' అనే ముందు మాటలలో చెప్పినట్లు వానకాలపు ఈగల్లా ముసురుతున్నాయన్నట్లే ఉన్నాయి. అంతకు మించిన గణ్యత యీ కథలకీ ఉన్నట్లు తోచదు.

'ఆధునిక మనస్తత్వం, పురాతన సంప్రదాయాలు, వంగ్యనీతి, వర్ణనవైచిత్రి సంతరించుకొన్న యీ కథలలో ప్రత్యేక విశిష్టత ఉంది' అని శ్రీ పోతుకూచివారు చెప్పటం అతిశయోక్తియని యీ పుస్తకం చదివితే అనిపిస్తున్నది.

## మట్టిబొమ్మలు

[నవల: రచన: శ్రీ తాడిగిరి పోతరాజు; ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్: విజయవాడ-2; 344 పేజీలు; సాదా ప్రతి రూ. 5.; మేలు ప్రతి రూ. 6.]

నవలలో విషయానికెంత ప్రాముఖ్యముంటుందో అంత ప్రాముఖ్యమూ భాషకుకూడ ఇవ్వాలి. గ్రామీణ వాతావరణాన్ని వర్ణించేటప్పుడు తత్తదుచితమైన భాషా, పాత్రోచితమైన సంభాషణలూ నవల కాయువుపట్టు. గ్రామీణ జీవనాన్ని, పట్టణపు యాంత్రిక జీవితానికీ మధ్య భాషాభేదం లేకుండానే పలుమంది రచయితలు నవలలు వ్రాస్తున్నారు. విషయంలో గొప్పదనం ఉండటంచేతా, నిర్వహణ నైపుణ్యంతోనూ ప్రసిద్ధ రచయితలుగా చెలామణీ అవుతున్నారు గూడ. కీ. శే. త్రిపురనేని గోపీచంద్‌వంటివారు భాషావిషయంలో జాగరూకత వహించారు. నేటి నవలా రచయితలలో భాషావైదుష్య లోపంచేత, శబ్దశక్తి తెలియని ప్రయోగాలతోనూ నవల లస్తవ్యస్తంగా తయారౌతున్నాయి. శ్రీ తాడిగిరి పోతరాజు వ్రాసిన 'మట్టిబొమ్మలు' నవల వేలాది నవలలు వచ్చిన పోటీలో మొదటి బహుమతి పొందిందంటే, దానిలోని భాషాసౌందర్యమే ప్రధానమైన కారణ మనుకుంటాను. శ్రీ తాడిగిరి పోతరాజు యీవరకే 'గాజుకిటికీ'వంటి కథలద్వారా పాఠకలోకానికి పరిచితులు. అంతరంగ పరిశీలనంలో పోతరాజుగారు మిక్కిలి ప్రతిభావంతులు. జీవితంలోని సౌందర్యాన్ని మాత్రమే గాదు, వికారాన్నీ, మనుష్యుల మంచితనంతోబాటు స్వార్థసహితమైన సంకుచిత ప్రవర్తనమూ వెల్లడించటంలో వెనుదీయరు. మెట్టతాలూకాల పల్లెటూళ్ళలో రైతుల మాట తీరును రచయిత ఎంత జాగ్రత్తగా విని ప్రతిభను జోడించి వ్రాశారో యీ నవలను చదివినప్పుడు, ఆ శిల్పానికి పాఠకులు అప్రతిభులౌతారు. పల్లెటూళ్ళ సౌభాగ్యం గాక, లేమినీ, రైతులలోని అమాయికత్వాన్ని అస్తమానమూ పొగడటంకాక, వాళ్ల మనస్సులలో అభేద్యమైన అడ్డుగోడలూ, వెలుగునీడలను సవ్యంగా సమకూర్చుకొని యీ నవలలో ప్రదర్శితమైనాయి.

పల్లెటూళ్ళో తలలో నాలుకగా మెలుగుతూ, ఊరందరికీ మంచిగా ఉంటూ, ఆదర్శాలతో ఊరంతటినీ అభ్యుదయ పథంలో నడిపించాలని ప్రయత్నిస్తాడు హైస్కూలు మాష్టరు. ఆయనకు ఊరి పెద్దమనిషి వెంకట్రామయ్య తోడై ఊరంతటినీ ఒక త్రాటిమీద నడిపింప జూస్తారు. వెంకట్రామయ్య పైకి మంచివాడైనా గుండెల్లో అగ్నిపర్వతం దాచుకొన్నవాడు. తన అక్రమ సంతానం ప్రసాద్‌ను మాష్టారిచేతి కిచ్చి పెంచమంటాడు. రహస్యం తెలియని మాష్టారు అతడినిపెంచి, పెద్దవాడిని చేసి, విద్యాబుద్ధులు గరపుతాడు. దీనికి వెంకట్రామయ్యగారి ఆర్థిక సాహాయ్యం ఉంటుంది. మాష్టారు ప్రసాద్‌కు తన కుమార్తె శారద నిచ్చి వివాహంచెయ్యాలనుకొంటాడు. ఇద్దర్నీ కాలేజీలో చదివిస్తూ ఉంటాడు. వెంకట్రామయ్య కొడుకు మధు పట్నంలోని కాలేజీలో చదువుతూ పల్లెటూరు వస్తాడు. 'ఫాషన్ల' వ్యామోహంతప్ప సంస్కృతి యెరుగని మధును శారద అసహ్యించుకున్నా క్రమంగా అతడి వైపు ఆకర్షిత అవుతుంది. ప్రసాద్ విద్యార్థిజీవి; ఆదర్శ యువకుడు. శ్రమ జీవనమూ, ఆత్మ గౌరవమూ అతడికున్న అలంకారాలు.

వెంకట్రామయ్య జబ్బుతో తీసుకొని చచ్చిపోతాడు. తర్వాత హైస్కూల్ పెత్తనం అతడి బావమరిదీ, ప్రెసిడెంటూ అయిన శివరామయ్యకు చెందుతుంది. మిడిల్ స్కూలు, హైస్కూలు కాగానే హైస్కూల్‌కి కొత్త హెడ్మాష్టర్ని తీసుకొస్తాడు శివరామయ్య. ఆ హెడ్మాష్టరు శివరామయ్యకు మాష్టరంటే ఉన్న అభిమానాన్ని ద్వేషంగా మార్చటానికి క్రమంగా ప్రయత్నించి సఫలీకృతుడౌతాడు.

ఈ నవలలోని ముఖ్యవిషయమూ, చిత్రమైన ఆర్థిక బిగువూ అంతా ప్రేమా, పెళ్ళి విషయం మీదే నడిచింది. మధు శారద అందానికీ, శారద బెట్టుసరి ప్రవర్తనకు లొంగిపోయి ఆమెనుతప్ప మరొకరిని ప్రేమించలేక పోతాడు. శారద ఎంత వద్దనుకున్నా మధు అందమైన బట్టలనుమాసీ, అతడికి వచ్చిన చిన్నచిన్న కష్టాలను సానుభూతితోనూ, తానంటే అతడు ప్రేమనెంతగా వ్యక్తీకరించి, పరవశుడైపోయిందీ గమనించి మధువైపే మొగ్గుచూపి అతడితో లేచిపోతుంది. మధులోని అందాలు ప్రసాద్‌లో చూడాలనుకొని విఫలమౌతుంది. ప్రసాద్ నిగ్రహమున్న యువకుడు కావటంతో శారదకు మధుపైగల బలహీనతను గుర్తించి, జారిపడి ఆమె లేచిపోవటానికీ సాయపడతాడు.

అన్ని పల్లెటూళ్ల గ్రామకక్షలలో ఉద్యోగులు బలియైనట్లే మాష్టరు న్యాయపక్షపాతి కావటంతో శివరామయ్య ఆగ్రహానికీ, మధుతల్లి అచ్చమ్మగారి ఆగ్రహానికీ బలియై ఉద్యోగం కోల్పోతాడు. ఉద్యోగం పోయి, శారద లేచిపోయినా, చిన్నకూతురు భానును ప్రసాద్ కిచ్చి చెయ్యాలనుకొంటే, అతగాడు చెల్లెలిగా భావిస్తున్నానని తిరస్కరించటంతో మాష్టారు పిచ్చివాడవుతాడు. భానూ తండ్రిప్రేమకు తిరస్కృతయై ఆత్మహత్య చేసికొంటుంది. నవల విషాదాంతగానే ముగుస్తుంది. మట్టిబొమ్మలైన మనుష్యులు విధి చేతిలో బొమ్మలై మట్టిలో కలిసిపోతారు. నైరాశ్యపు టవలోకనంతో నవల ముగించారు. విషాదాంతమైనందుకు కాదుగాని నైరాశ్యం మిగిల్చినందుకు నవలను మెచ్చుకోలేము.

విధిచేతిలో నలిగిపోయే మట్టిబొమ్మలపట్ల రచయిత సానుభూతి కనుపిస్తుంది. కాని సానుభూతిలో చేవ లేదు. అధర్మం నగ్నంగా నర్తించినప్పుడు, అన్యాయం పడగవిప్పినప్పుడు ఎదలోని అశ్రువులను చాటుగా తుడుచుకొనే సున్నిత హృదయులైన మానవులపట్ల సానుభూతి ఉంటే చాలదు. వారిలో ఆశలు రేకెత్తించే, అన్యాయా న్నెదిరించే, అధర్మాన్ని యెదుర్కొనే బలం కలిగించాలి. అంటే రచయిత మాటిగా ప్రబోధం చేయనక్కర లేదుగాని సమాజం కాంతివంతం కావాలని ఆశ ఉండాలి. అంతేగాని 'చీకటికి నా సానుభూతి' అంటే చాలదు. నవల చివరికి వచ్చినప్పుడు రచయితలో నిలకడ కనిపించదు. సంఘటనలన్నీ వాస్తవంగాగాక, నాటకీయంగా మారిపోయాయి. రచయిత చేతిలో కీలుబొమ్మలుగా కన్పించి పాత్రలు వాటి వ్యక్తిత్వాన్ని కోల్పోయాయి.

ఆద్యంతమూ, యీ నవలలో ఆనందింపజేసేది భాష. పల్లెటూరి వాతావరణమూ, మన పల్లెటూళ్ల తాలూకు పడిపోయిన గోడలూ, దేవిడీ, ఏ కొత్త భావాన్నీ స్వీకరించలేని మౌఢ్యమూ, బండబారిపోయిన

మొరటు మనుష్యులూ, ఎవరికి కష్టంవచ్చినా ఆదుకొనటంపోయి, నిర్లిప్తత వహించటమూ, కొన్నిసారులు నీలాపనిందలతో హింసించటమూ బాగా కనిపిస్తాయి యీ నవలలో. మాష్టారు న్యాయంకోసం నిలబడినప్పుడు, దౌర్జన్యంతో శివరామయ్యా, అచ్చెమ్మా బెదిరించినప్పుడు ఒక వాస్తవమైన దృశ్యాన్ని చిత్రించారు రచయిత. వాళ్లింటిముందు వేపచెట్టును పడగొడుతున్నారట. పెద్ద పెద్ద గొడ్డళ్లతో పెళిల్లున కొడుతున్నారనీ, తాళ్లతో బంధించి నేలపైబడేలాగ లాగుతున్నారని చెప్తారు. ఇంతే యీ మనుష్యులు - నిలువ నీడనిచ్చి ఎన్నోతరాలు సాయపడిన వేపచెట్టును అవసరం తీరినతరువాత నిర్దాక్షిణ్యంగా పడగొట్టేస్తారు. అదర్శాలతో ఆ గ్రామానికే వెలుగునిచ్చి నడిపించిన మాష్టారిని అన్యాయం చేస్తే ఆ గ్రామంలో ఏవిగా పట్టించుకోరు.

ఈ నవలలోని వాస్తవికతా చిత్రణకు, సొగసైన భాషకూ యీ నవల బహుమతిని పొందినా, జీవితంపట్ల ఒక చిత్రమైన అవగాహనను కలిగించగలిగినా, జీవితమంటే మొడతెగని ప్రేమనూ, జీవితంపట్ల ప్రగాఢమైన నమ్మికనూ కలిగించటంలో విఫలమైనది. శ్రీ పోతరాజుగారు మున్ముందు మరింత మంచినవలలు వ్రాయగలరనే నమ్మిక యీ నవలద్వారా కలిగిస్తున్నారు.

## కాశ్మీర పట్టమహిషి

[రచన: శ్రీ పిలకా గణపతిశాస్త్రి; ప్రచురణ: శ్రీ యం. శేషాచలం అండ్ కో: మచిలీపట్టణము: సికిందరాబాదు; మద్రాసు; 192 పేజీలు, వెల: రూ. 2.]

భారతదేశపు కమ్మని కల కాశ్మీరం. కుంకుమపువ్వుతరంగులూ, పూ పరిమళాలూ దేశీయు లందరినీ ఆకర్షించి అందచందాలతో వశం చేసికొన్నాయి. కాశ్మీర చరిత్రకూడ యోధులకు పరాక్రమానికీ, భోగానికీ భాగ్యానికీ ఆలవాలమై చరిత్రలో సువర్ణాక్షర లిఖిత మనిపించుకొన్నది. క్షేమేంద్రునివంటి కవుల, ఆలంకారికుల రచనలతోబాటు మరగునబడ్డ కమనీయగాథలను కాశ్మీర చరిత్ర చదివి మననం చేసుకోవచ్చు. 'రాజతరంగిణి' ఎన్నెన్నో కాశ్మీర గాథల్ని గ్రంథస్థం చేసింది. ఏ కథ కదిలించినా ఆనాటి కాశ్మీర ప్రజల జీవన విధానాన్ని కళ్లకు కట్టిస్తుంది. 'రాజతరంగిణి'ని చరిత్ర పరిశోధనకు ముడిసరుకుగా చాలమంది చరిత్రకారు లుపయోగించుకుంటున్నప్పటికీ, అందులోని కొన్ని గాథలపట్ల వాళ్లకు సమన్వయం కుదురనప్పుడు పుక్కిటి పురాణాలక్రింద కొట్టివేస్తున్నారు. చరిత్ర పరిశోధనలో వాఙ్మయాలంబనాన్ని చరిత్రకారు లందరూ అంగీకరించినా శాసనాలు, నాణేలు, పురాతన త్రవ్వకాలలో బయల్పడిన వివిధవిశేషాలకూ యిచ్చిన ప్రాధాన్యము వాఙ్మయానికి ఇవ్వటంలేదు. సాహిత్యవేత్తలలో యిచ్ఛాపూర్వకంగా చరిత్రగతిని తప్పుత్రోవ పట్టించటాన్ని అసలెందుకు చేస్తారు?—అన్నదే ప్రశ్న. సాహిత్యవేత్తల అతిశయోక్తుల వ్యాపారం చేసికొని చరిత్రకు సాహిత్యంచేసే సహాయాన్ని దూరంచేసికోవటం తప్పు. 'గాథాసప్తశతి'వంటి గ్రంథాలు చదివినప్పుడు ఏ చరిత్రకారుడూ మరే యితర శాసనాద్యాధారాలతో యివ్వలేని సమాచారాన్ని సాహిత్యమే అందివ్వటం గమనించగలుగుతాము. నవలా వాఙ్మయశాఖలో చారిత్రక నవల ఉపశాఖ చేవగలది. చరిత్రగతిని మార్చకుండ, అభూతకల్పనలు లేకుండ, శిల్పసౌందర్యం చెడకుండ, పాత్రల ఉదాత్తతను కించపరచకుండ నవలను నడిపించాలి. ఇదెంతటి క్లిష్టమైన పనో చారిత్రక నవలలు వ్రాసినవారికీ, చదివినవారికీ తెలుసు. కీ. శే. అడవి బాపిరాజు ఆంధ్రుల చరిత్రను తవ్వి అమూల్య సంస్కృతి సంపదను మూటగట్టి యిచ్చారు. శ్రీ నోరి నరసింహశాస్త్రి, కీ. శే. కాళ్ళకూరి నారాయణరావు, శ్రీ విశ్వనాథ మొదలైన వారు ఆంధ్ర సంస్కృతిని వాఙ్మయంలో నిక్షేపించ యత్నించారు. కీ. శే. మల్లంపల్లి వారు చరిత్ర పరిశోధనకు, పరిశోధకులకు బాసటగా నిల్చి చాలకాలమే కార్యాన్ని అవిఘ్నంగా నడిపించారు. విశ్వవిద్యాలయం ప్రోత్సహించి వ్రాయించిన చారిత్రిక నవలలు యినుప గుగ్గిళ్ళై, విద్యార్థులకు పాఠ్యగ్రంథాలుగా దప్ప స్వతంత్రమైన చారిత్రక నవలలుగా విలువలేక పోయాయి. గాథాసప్తశతిలోని అందచందాలను, భాషనూ శ్రీయుతులు రాళ్ళపల్లి; తిరుమల రామచంద్రగారలు వెలికి

తీశారు. 'రాజతరంగిణి'లోని తాతల తాతలనాటి గాథలనూ కమ్మని కథలుగా శ్రీ పిలకా గణపతి శాస్త్రిగారు రూపు రేఖలు దిద్దారు. 'కాశ్మీరపట్ట మహిషి' అనే యీ చిన్న నవలలోని కథకూడ 'రాజ తరంగిణి'లోనిదే. నవలలో చారిత్రక సత్యా లనూ, పేర్లనూ యథాతథంగా ఉంచారు. నవలలో కొన్ని చిన్నచిన్న పాత్రల, సన్నివేశాల కల్పనలు దప్ప మిగిలినదంతా రాజతరంగిణిలోనిదే. విడ్డూరమైన కథకు శ్రీ గణపతిశాస్త్రిగారు సమర్థననేవీ కల్పించ లేదు. ఆకర్షకంగా తీర్చిదిద్దారు. ఇంతకు పూర్వమే శ్రీ తల్లావఝల వారు 'నోణకజాయ' అనే నాటిక వ్రాశారు. రెండవ ప్రతాపాదిత్య చక్రవర్తి కాలంలో జరిగినట్లు రాజతరంగిణి చెప్పున్న యీ గాథకు నవలారూపం కాశ్మీరపట్టమహిషి. కన్నుల కింపైన 'బాపు' వ్రాసిన ముఖచిత్రం సరసుల మదిలో చిరకాలం మెదులుతుంది.

రెండవ ప్రతాపాదిత్య చక్రవర్తి పరిపాలి స్తున్న కాలంలో నోణకశ్రేష్ఠి అనే సంపన్ను డుండే వాడు. ఇతడు రాజంతటి సంపన్నుడని రాజతరంగిణి వలన తెలుస్తున్నది. అతడికి నరేంద్రప్రభ, కమలాలయ అనే యిరువురు భార్య లున్నారు. వారిలో నరేంద్రప్రభ అపురూపసౌందర్యవతి; సంగీ తంలో మిక్కిలి ప్రవీణురాలు. వీణ వాయించటంలో ఆమె పేర్పుకు చక్రవర్తి ముగ్ధుడైనాడు. నోణక శ్రేష్ఠి లోభి, మరీ వ్యాపారస్తుని మనస్తత్వమే అతడిది. కళలకూ అతడికీ కడుదూరం. కర్పూర శ్రేష్ఠి కుమారుడైన నోణకశ్రేష్ఠి వ్యాపారంలో గడుసుపిండం. రాజుగారితో వ్యాపార సంబంధాలను పెంపొందించుకోవటంలో తండ్రికంటె నాలుగాకు లెక్కువే చదివాడు. చక్రవర్తిని తన ఇంటికి ఆహ్వా నించి రుచికరమైన మధువు నందించటంతోను, తన భార్య వీణావాదనం వినిపించటంతోనూ, ఆకర్షించి వ్యాపారం వృద్ధిచేసికొంటాడు. చక్రవర్తి సరసుడు. ధర్మనిరతుడు, నరేంద్రప్రభపై మరులుకొని, వెల్ల డించలేక వియోగబాధతో మంచం పడతాడు. నరేంద్ర ప్రభ, చక్రవర్తిపట్ల ఆకర్షితయైనా ధర్మభీతితో సతమత మవుతుంది. అది ప్రేమో కాదో తేల్చుకో లేకపోతుంది.

నోణకశ్రేష్ఠి గొప్పవిపత్తు నెదుర్కొన్నాడు. అది నరేంద్రప్రభను రాజు ప్రేమించినట్లు తెలి యటంకాదు. తన వ్యాపారపరిస్థితి తలక్రిందులు కావటం. అందుకై శ్రేష్ఠి ఏమిచెయ్యటానికైనా సిద్ధమే; చివరకు తన భార్యను తన సమ్మతితోనే చక్రవర్తి కిచ్చి పెళ్లిచేయటానికైనా. అతడి రెండవ భార్య కమలాలయకూడ నరేంద్రప్రభను వదలించు కోవాలని చూస్తుంది. నరేంద్రప్రభమాత్రం ససేమిరా సమ్మతించదు. ధర్మవిరుద్ధంగా సంచరించటానికి మానసికంగానైనా ఆలోచించదు. పతి అనురాగానికి దూరమైనందుకు విరసనగా, తన గాన, నాట్యకళా వైదగ్ధ్యాన్ని సార్థకం చేసికొనేటందుకు ఆమె దేవదాసిగా మారిపోతుంది. అప్పుడు చక్రవర్తే స్వయంగా ఆమె చెంతకు వచ్చి తన ప్రణ యాన్ని ప్రకటించి, ఆమెను పట్టమహిషిగా స్వీక రించగలనని, తనను కాశ్మీర దేశాన్ని ఏలుకొమ్మని ప్రార్థిస్తాడు. ఆమె అంగీకరిస్తుంది. తద్వారా ఆమె కాశ్మీరపట్ట మహిషి అయింది. ఇది ఈ నవలలో చెప్పిన కథ. నరేంద్ర ప్రభకు ముగ్గురు కుమారులు కలిగేరు. చంద్రాపీడుడు, తారాపీడుడు, లలితా దిత్యుడు అనే యీ కుమారులు ముగ్గురూ వరు సగా రాజ్యం చేశారు. చంద్రాపీడుని గూర్చి 'కాదం బరి' కథలో ప్రసక్తి వస్తుంది. కాశ్మీరదేశపు రాజ్యమూ, రాజుల, పరిపాలనా విధానమూ, కళా వైభవమూ తెలియాలంటే 'రాజతరంగిణి' తప్పక చదవాలి. కాశ్మీర ప్రకృతి సౌందర్యమూ, సమాజ పరిస్థితులూ, కళలకున్న ఆదరణ కాశ్మీర పట్ట మహిషి చదివితే విశదమౌతాయి.

కాశ్మీర కుంకుమ తోటల నేత్రపర్వమైన ప్రకృతి, కర్ణీరథాల సవ్వడీ, వజ్రాల వాణ్యమూ, వీణా వాదనంలో శ్రావ్యతా, చక్రవర్తి సభామర్యా దలూ, అన్నీ కలగలుపుగా పాఠకుల్ని ఆహ్లాదపరు స్తాయి. ఈ నవలలో కథావిషయాన్ని యథాతథంగా చెప్పటంతో కల్పనలకు ఎక్కువ అవకాశం లేక పోయింది. అయినా అభూత కల్పనలేవీ లేవు. చరిత్ర కథనంలో వక్రత లేదు. ఆదర్శప్రాయమైన చారిత్రక నవలగా 'కాశ్మీర పట్టమహిషి'ని యెంచ వచ్చు. నవలకు వలసిన బహుముఖమైన శిల్ప విన్యాసం

లోపించి నూటిగా వెళ్ళిపోయిన కథాకథనమే కన్పిస్తుంది. సంగ్రహంగానైనా ముద్దులు మూటగట్టేలాగ కాశ్మీర పట్టమహిషిని తీర్చిదిద్దిన శ్రీ గణపతి శాస్త్రిగా రభినందనీయులు.

## బంధమూ-అనుబంధమూ

[రచన: శ్రీ పి. వి. కృష్ణమూర్తి; ప్రచురణ: శ్రీ యం. శేషాచలం అండ్ కో; మచిలీపట్టణము, సికిందరాబాదు; మద్రాసు; 200 పేజీలు; వెల రూ. 2.]

ప్రత్యేకంగా వొకేవిధమైన జీవిత విధానాన్ని వర్ణించే నవలలు తెలుగులో అంతగా రావటంలేదు. ఆటవిక జీవితానికి, నౌకాయానానికీ, పూర్తిగా గ్రామీణ జీవితానికి సంబంధించినవో, లేదా ప్రత్యేకమైన వృత్తికి—లాయరూ, డాక్టరూ, ఇంజనీరూ వాటికి సంబంధించినవో రావటం అరుదుగా జరుగుతున్నది. శ్రీ ఉప్పల లక్ష్మణరావుగారు వ్రాసిన 'అతడు - ఆమె' నవల చదువుతూంటే, లాయరూ, డాక్టరూ, ఇంజనీరూ, వారి వృత్తులనూ, జీవితానికీ సంబంధించిన వాతావరణాన్నీ, సమస్యలనూ ఎంత కూలంకషంగా పరిశీలించారో తెలుస్తుంది. ఆటవిక జీవితానికీ, నౌకాయానానికీ సంబంధించిన రచనలు చదవాలంటే మన పాఠకులు అనువాదాలతో తృప్తిపడవలసిందే. ఈ అనువాదాలవరకైనా సారస్వత సేవ చేసిన 'ఆంధ్ర గ్రంథమాల'వారిని అభినందించి తీరాలి. నవల నవరసభరితంగా ఉండాలని యత్నించి, తాపత్రయపడి ఎందరో వ్యక్తుల సమస్యలతో దానిని సతమతం చేస్తున్నారు రచయితలు. ఏదో వొకవిధమైన జీవిత యితివృత్తాన్నే స్వీకరించినప్పుడు 'యిదంతా వారి గొడవ' అని ఊహనడిస్తున్నారు పాఠకులు. ఈ అవ్యవస్థ తెలుగు నవలా రచననుండి నశించాలి. ప్రత్యేకమైన వాతావరణానికీ, వృత్తులకీ సంబంధించిన నవలలు రావాలి. ఆ వాతావరణాన్ని వర్ణించటంలో రచయితలు ప్రతిభ కనబరుస్తే పాఠకులు తప్పక ఆదరిస్తారు.

'సినిమా' జనజీవితంతో విడదీయరాని బంధం యేర్పరచుకొన్నది. సామాన్య సంసారికి అందుబాటులో ఉన్న ఒకేఒక్క కళగా మిగిలింది. కష్టసుఖాలన్నింటిని సినిమా సంఘటనలతో పోల్చుకొనేటంత దగ్గరైనది 'సినిమా'. కాని సాంఘిక చిత్రాలుకూడ 'గాలిలో కనరాని గడుసుదయ్యాల' మాదిరిగా భూదివమ్ముల మధ్యనే ఊగాడుతున్నాయి. ప్రేక్షకుడిని కదిలించటంలేదు. ప్రజానీకాన్ని నడిపించటానికి సినిమాను శక్తిమంతమైన సాధనంగా వినియోగించుకోవచ్చు. కాని ఆ కళ దుర్వినియోగమై పోతున్నది. జన జీవితంలో ఇంతటి సన్నిహిత సంబంధం కలిగిఉన్న సినిమా వ్యక్తుల గురించి తెలుగులో ఎన్నదగిన మంచి నవలలు రాలేదు.

శ్రీమతి మాలతీ చందూర్‌గారి 'చంపకం—చెదపురుగులూ' వంటి నవలలు సినిమా జీవుల గురించే వచ్చాయిగాని తగినంత ఆదరం సంపాదించుకోలేదు. 'సినిమా జ్వరం' అనే చిరస్మరణీయమైన కథ వ్రాశారు చలంగారు. సినిమా పిచ్చితో పట్నం చేరి పతనమైన వారినిగూర్చి శ్రీయుతులు కొడవటిగంటి, ధనికొండ మొదలైన వారుగూడ కొన్ని కథలు వ్రాశారు. శ్రీ పి. వి. కృష్ణమూర్తిగారు వ్రాసిన 'బంధమూ-అనుబంధమూ' నవలకూడ సినిమా వ్యక్తులకు సంబంధించినదే. ఆదర్శాలున్న అందమైన యువకుడు పట్నం చేరి సినీనటుడుగా రాణించాలనుకొంటాడు. కాని పరిస్థితులు దర్శకుడిగా తయారు చేస్తాయి. తల్లి బలవంతంపైన మేనగోడలినే వివాహం చేసికొంటాడు. కాని ఆమె అనుకూలవతి కాదు. పైగా వివాహంముందే మరెవరితోనో సంబంధం పెట్టుకొని గర్భవతి అవుతుంది. అమాయికంగా పెళ్ళాడి మోసపోయిన దయానిధి ఆమెను క్షమించలేక పోతాడు. ఆమె పశ్చాత్తాపపడి,

క్షమాభిక్ష కోరితే క్షమించేవాడేమోగాని అందుకామె యెట్టి ప్రయత్నమూ చెయ్యక బిడ్డ అతడికి పుట్టిన బిడ్డేనని నమ్మపెట్టజూస్తుంది. దయానిధి విరక్తుడై, తల్లికికూడ దూరంగా సినీరంగంలోనే కాలం గడుపుతూంటాడు. ఏదో ఊళ్ళో పెళ్ళికి వెళ్ళినప్పుడు పరిచయమైన సౌందర్యవతి, కులానికి వేశ్య అయిన 'శ్రీలేఖతో' ఆత్మీయతను పెంచుకుంటాడు. ఆమెకూడ నిష్కల్మషంగా అతడి చెంతనే ఉండి అతడి కర్ధాంగిగా మసలుకొంటుంది. అతడి కోరిక పైనవే సినిమాలలో నటించటానికి అంగీకరిస్తుంది. అందచందాలతోనూ, నాట్యవైదుష్యంతోనూ అచిర కాలంలోనే తారాపథాన్నందుకొని సంవత్సరాలవుతుంది. వారిద్దరి మధ్యగూడ ఏ విధమైన భేదాభిప్రాయాలు రాకపోయినా విషపూరిత సినీ వాతావరణం ఎన్నో చిక్కులు తెచ్చిపెడుతుంది. వారిద్దరినీ విడదీయటానికి ప్రయత్నిస్తుంది. లక్షాధికారులూ, కోటీశ్వరులూ, కుత్సితులూ అయిన నిర్మాతలూ, డిస్ట్రిబ్యూటర్లు తారలను కీలుబొమ్మలుగా ఆడించటం ఆమె సహించలేక పోతుంది. ధైర్యంగా యెదిరిస్తుంది. కాని కుటిల పన్నగమైన నిర్మాత కాటువేస్తాడు. నిస్సహాయయై దాస్యం భరించలేకపోతుంది. క్షయ వ్యాధి పీడితుడైన దయానిధి మదనపల్లి శానిటోరియంలో చేరి తన ప్రియురాలైన శ్రీలేఖతో చెప్పకనే దాచిపెడతాడు. కాని కొంతకాలం తీసుకున్నాక చచ్చిపోతాడు. దయానిధి ఏమైనదీ తెలియక కల్లోలిత మనస్కయైన శ్రీ లేఖ సినిమాలలో నటించ నిరాకరిస్తుంది. చిత్ర నిర్మాణం మధ్యలో ఆగితే వచ్చే నష్టాన్ని భరించలేక నిర్మాత శ్రీలేఖ నవమానించ తలపెడతాడు. శ్రీలేఖ పారిపోయి స్వగ్రామం చేరుకొని, దయానిధిని తలచుకొంటూ ప్రాణాలు విడుస్తుంది.

ఈ నవలలో శ్రీలేఖ గూర్చి చదువుతున్నంతసేపు తారాపథంలో ఉజ్వలంగా వెలిగి, తర్వాత ఉన్మాదినియైన ఒక తార జీవితం మనసులో మెదులుతుంది. దయానిధి చనిపోబోయేముందు ఆస్తిఅంతా అతడి పేరనే ఉంటుంది. దయానిధి హఠాత్తుగా చనిపోగా ఆస్తికి 'అగ్ని'సాక్షిగా పెళ్ళాడిన భార్య వారసురాలవని వస్తుంది. అతడి మనసులో మనసుగా మెలిగి, కష్టించి నటించి సంపాదించి నిస్వార్థంగా దయానిధిపేర తన డబ్బంతా దాచిన శ్రీలేఖ కా ఆస్తిలో చిల్లిగవ్వైనా రాదు. డబ్బులేకనే ఆమె నిర్మాతల వొత్తిడికి లొంగిపోవలసివస్తుంది. చిత్రమైన యీ విపత్కరపరిస్థితిని కల్పించి అతడి హృదయాన్ని చూరగొన్న నిజమైన భార్య యెవరు? అని ప్రశ్నిస్తారు రచయిత. ఏవిధంగానూ దయానిధి కష్టసుఖాలు పంచుకొనని భార్య వారసురాలు కావటమూ, అతడి ప్రాణసఖి కేమీ చెందకపోవటమూ విచారాన్ని కలిగిస్తాయి. కొత్త సత్యాన్ని గుర్తెఱింగింప జేస్తాయి.

శ్రీలేఖపట్ల అపరిమితమైన సానుభూతిని కలిగించటం తప్ప మరేవిధంగానూ యీ నవల రంజింపజేస్తుందని చెప్పలేము. కథనంపట్ల చూపిన శ్రద్ధ శిల్పంలో చూపలేదు. వాస్తవికతను సృష్టించటానికి చేసిన ప్రయత్నంలో పూర్తిగా కృతకృత్యులు కాలేకపోయారు.

—రామమోహనరాయ్.

## సాహిత్య దర్శనము

[వ్యాసావళి. రచన : శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు. ప్రచురణ : కవితాలత, దుర్గాగ్రహారం, విజయవాడ—2. వెల: మూడు రూపాయలు.]

పన్నెండు వ్యాసాలున్న ఈ గ్రంథంలో విషయగత వ్యాసాలకంటే వ్యక్తిగత వ్యాసాలు అధికం. సాహిత్యంలోనూ, జీవితంలోనూ, సాహితీ జీవితంలోనూ, జీవిత సాహిత్యంలోనూ సరసులు, విజ్ఞులు, ఉత్తములు అయిన పలువురు పెద్దలగూర్చి కవితా హృదయమూ సాహితీ విజ్ఞతా మూర్తిదాల్చిన శ్రీ కాటూరి, తమ కలంనుంచి చిలకరించిన రూపాలు, హృదయ విపంచి నుంచి ఆలపించిన రాగాలు, సహృదయ హృదయామోదకరంగా ఉన్నాయి.

ఈ గ్రంథంలో మొదటివ్యాసం విమర్శకళ. విమర్శనం కళారూపం కాగలదా? అయితే ఆ కళా రూపం ఏ విధంగా వుంటుంది? చతుష్షష్టి కళా

జగత్తునుంచి ఆనందం ఆవిర్భవిస్తుంది. కళా రూపం పంచేంద్రియ పరమార్థమై, బ్రహ్మానంద సదృశమైన అలౌకికానందం అందిస్తుంది. విమర్శనం కళ అయితే అటువంటి ఆనందం కలిగింప సమర్థమై వుండాలి. వస్తుగత పరిశీలన ఫలితంగా, కళ హృదయవర్తి, హృదయవికాసకారకం. విమర్శ బుద్ధిజన్యం, ఆలోచన అవధిగా గలది. బుద్ధిజన్యమైన విమర్శ, హృదయవికాసం కలిగింప గల కళారూపం పొందితే అప్పుడు విమర్శ కళ కాగలదు.

శ్రీ కాటూరి 'విమర్శ కళ' అను వ్యాసంలో విమర్శ కళ కాగలదని వ్యక్తంచేస్తూ ఈ విషయాన్ని స్వీకరించటం పాఠకులు గమనిస్తారు. 'అజంతా గుహాచిత్రములయందు, ఒకానొక చిత్రమున బాలకు డొకడు నిలిచియున్నాడు. వాని వెనుక నొక స్త్రీమూర్తి నిలిచియున్నది. ఆ బాలుని భుజములపై తన కరతలములుంచియించుక వంగియున్న దా స్త్రీమూర్తి. బాలుడు మోడ్పుకరములతో ముందునకు దూరపుచూపులు పరపుచున్నాడు. వాని చూపుల వెంటనే ఆ తల్లిచూపులుకూడ ప్రసరించుచున్నవి.' ఈ చిత్రం వ్యాఖ్యానించే విమర్శకుడు సరసంగా, మనోజ్ఞంగా, భావస్ఫోరకంగా, వస్తుగతభావ సముజ్జ్వలంగా రచనచేస్తే ఆ రచన విమర్శ అయి కూడా కళ కాగలదు, అనే అభిప్రాయం పై వ్యాసంలో గోచరమవుతుంది.

పై అభిప్రాయం పరిపూర్ణంగా పరిపోషించిన వ్యాసాలు రెండు ఈ గ్రంథంలో ఉన్నాయి. 'మా బాపిరాజు' కీ॥ శే॥ అడివి బాపిరాజు పై స్మృతి వ్యాసం. విషయ విభాగం మొదలైన తీరు తెన్నులతో సాగిన ఆ వ్యాసం చదివి, ముగించిం తర్వాత, ఎవరూ వ్యాసం చదివామన్న అభిప్రాయంలో ఉండరు. ఏమీ ఆలోచించలేరు. ఒక అనుభూతిలో లీనమయి పోతారు. ఆ అనుభూతికి కారణం రచనా విధానం. రచించిన తీరులో ఉన్న శిల్పం. ఆ వ్యాసం బాపిరాజు రూప, స్వభావ చిత్రణ. అనేకులతో ఆ వ్యక్తిగల సంబంధం. బాపిరాజు సృజించిన కళా ప్రపంచం చూచి, హృదయం గుర్తించవి పాఠకులు ఈ వ్యాసం చూచి 'ఇంత కోమల హృదయుడా' అనుకొంటారు. విమర్శనాత్మకమయిన ఈ వ్యాసం ఒక ఉత్తమ కథానికలాగా కళాత్మకమయింది!

ఇటువంటి వ్యాసాలు చదివి, పాఠకులు విమర్శ కూడా కళయే అనుకొని తీరుతారు. బాపిరాజు హృదయం కోమలమయిందని, స్త్రీ హృదయం కంటే కోమలమయిందనీ, 'స్వభావముచేతనే పురుషుడు కళారక్తుడగువేని వానిది స్త్రీ ప్రకృతి' అని శ్రీ కాటూరి సాధింప ప్రయత్నంచేసే విషయం తలపోస్తుంటే శ్రీ పింగళి లక్ష్మీకాంతం, 'వాది స్త్రీ ప్రకృతి, రూపం పురుషరూపం' అని పూర్వం పలుకుతుండే మాటలకు అప్పుడు అర్థంగాని భావం, ఈ వ్యాసం చదివిం తర్వాత గోచరమయి తీరుతుంది.

మధుర భారతి, స్వయం వ్యక్తి అయిన కీ॥ శే॥ బుచ్చిసుందరరామశాస్త్రి స్మృతి వ్యాసంలో శ్రీ కాటూరి కలం విమర్శను కళగా రూపొందించినది. ఈ వ్యాసంకూడా చక్కని కథానికలాగా సాగింది. కీ॥ శే॥ రామశాస్త్రి హాస్య కుశలత ప్రశంసాపాత్రంగా ప్రదర్శించిన శ్రీ కాటూరి అభినందనలు పొందినట్లే!

'ఈ క్ష్మాతలిన్ విసుబోలు సత్కవులు లేరీనాటి కాలంబునన్' —శ్రీనాథుడు,

'మహేంద్ర కవితా విద్యా బల ప్రౌఢి నీ కెదు రేరీ పరపార్థ బోధ ఘటనా హేలా పరిష్కార శారద నీ రూపము'—రామకృష్ణుడు,

'అమలోదాత్త మనీష నే నుభయకావ్య ప్రౌఢి పాటించు శిల్పమునం బారగుడన్ కళావిదుడ'— సోమయాజి (నిర్వచనోత్తర రామాయణము),

'విపుల శబ్దశాసనుడ, నానారుచిరార్థసూక్తి నిధి' నన్నయ,

పలికినట్లు, ఆంధ్ర కవులలో తమ గొప్పతనం 'ఇంతింతై, వటుడింతయై'—అన్నట్లు చెప్పుకోవటం సామాన్యమే. కానీ అనంతరకాలంలో తిక్కన 'నా నేర్చిన యట్లు చెప్పి వరణీయుడనయ్యెద భక్తకోటికిన్' అన్నట్లుగావే ఎఱ్ఱన 'సకలభాషా కవిత్వ విశారదుడవు, సాధుసమ్మతుడవు, నిత్యసౌమ్యమతివి, భావ్యుడవు' అని హరివంశకృతిపతిఅయిన వేమారెడ్డి పలికినట్లుగా, వ్రాసుకొంటే అది ఎఱ్ఱన సౌమ్యస్థితినీ, సాత్త్వికతను తెలుపుతుందా? ఆంధ్రకవి

సాధారణమైన, తమ స్థానం తెలుసుకొనే ప్రయత్నం వ్యక్తం చేస్తుందని శ్రీ కాటూరి, ఎట్టిన వ్రాసుకొన్న పై మాటలలో సకలభాషాకవిత్వ విశారదుడవు అన్న విషయం తొలగిస్తే తక్కింది అంతా సాత్త్వికత సరసోదాహరణంగా భావిస్తే పాఠకులు, సరసులు మరొకవిధంగా భావించే అవకాశం లేకపోలేదు.

కవికుల గురువయిన రవీంద్రుని తపోవన సందేశం, శ్రీ కాటూరి వ్యాఖ్యానించిన తీరులో ఆంధ్ర పాఠకులకు ఆనందం కలుగుతుంది. రవీంద్రునిపై అభిమానం పెరుగుతుంది.

ఏ రచనాప్రక్రియ అయినా సమాజం ప్రతిబింబింపగలిగింది అయివుండాలని కోరటం ఉచితమే. ఆ రచనాప్రక్రియ సంఘసంస్కారం ప్రతిష్ఠించేదిగా వుంటే పరమవాంఛనీయం.

'నవల—సంఘ సంస్కారము'అన్న వ్యాసంలో సంఘ సంస్కరణకు నవల ఎక్కువగా అనుకూలత కలిగివుందని రచయిత అభిప్రాయం.

'వ్యష్టిసమష్టుల సంఘర్షణవలననే నూతనాచారములు పుట్టును......వ్యష్టికి నెత్తిపై మేకులు గొట్టిన సంఘము లన గోయి తానే త్రవ్వుకొనును' అన్న ఈ వ్యాసంలోని వాక్యాలు సమర్థాలు.

ప్రతాపరుద్రీయంలో పేరిగాడు, సజీవపాత్ర. రాజుగారితో పేరిగాడికి ఆకారంలో పోలిక ఉన్నంత మాత్రాన గుణశీలాదులలో పోలిక ఎలా వుంటుంది? ఉండదు. ఆ ఉండకపోవటంనుంచి జనించిన హాస్యం నాటకానికి వన్నె తెచ్చింది.

'పేరిగాడు' వ్యాసంలో రచయిత హాస్యంపై వ్యక్తం చేసిన అభిప్రాయం ఆమోదకరంగా వుంది.

'నిజమైన హాస్యం మెదడునుంచి ఉద్భవించేది కాదు. హృదయంనుంచి ప్రవహిస్తుంది. హాస్యమంటే వెక్కిరింత కాదు. విరసన కాదు. దాని సుస్వరూపం ప్రేమ.'

చాకలి పేరిగాణ్ణి సింహాసనంమీద కూర్చుండబెడితే వెనుకటి గుణం మర్చిపోలేదు. కల్లుముంతా, ఉల్లీ ఉండాలని ఆశపడుతాడు.

వీరశృంగారాలలో ఏదో ఒకటి అంగిరసంగా నాటకం ఉండాలని లాక్షణికులు గిరిగీస్తే, ప్రహసన రచనలో, ఆ గిరిదాటిన మహనీయ వ్యక్తి, కందుకూరి వీరేశలింగం పంతులు.

ఆ పైన వచ్చిన హాస్య నాటకాలు కన్యాశుల్కం, ప్రతాపరుద్రీయం, కంఠాభరణం ఆంధ్ర సాహిత్యంలో విశిష్టస్థానం సంపాదించుకొన్నప్పటికీ, కన్యాశుల్కంలోని హాస్యం పోయిన పోకడలు, లోతులు, తదితర నాటకాలలో అంత విరివిగా కనిపించవనే చెప్పుకోవాలి.

ఆంధ్ర సాహితీ జగత్తులో ప్రత్యేకమై, తదితర భాషా సాహిత్యాలలో మృగ్యమయిన సారస్వత పద్ధతి అవధానం. అందులో ఆశుకవిత్వం ఒక విశిష్టత.

ప్రాచీన సాహిత్యంలో లభ్యమయిన ముక్తకాలు, చాటువులు ఆశుకవిత్వ రచనకు ఆద్యరూపాలుగా చెప్పుకొనవచ్చు. సద్యస్ఫూర్తి సమాహిత రూపం ఆశుకవిత్వం.

'ఆశుకవిత్వము' అను వ్యాసంలో రచయిత, జాతి జీవితం ప్రతిబింబిస్తుందని చెప్పి, దాని అర్హతానర్హతలు, సమగ్రంగా చర్చించిన తీరు దర్శనీయం.

శ్రీ భట్టాచార్య విరచితమైన 'శ్రీకృష్ణుడు—విదురుడు' అనే త్రివర్ణచిత్రం ఆధారంగా వ్రాయబడిన 'విదురుని విందు' అనే వ్యాసం ఒక కళాఖండం, ఉత్తమ గల్పిక.

'కళాపూర్ణోదయము'లో పింగళి సూరన చిత్రించిన 'సరస్వతీ చతుర్ముఖుల శృంగారము'ను శ్రీ కాటూరి ఉపాఖ్యానప్రాయంగా స్వీకరింపలేదు. తన్మూలంగా కవి, సమాధ్యవస్థ నతిక్రమించి, రచనా వ్యవసాయం ప్రారంభించటంతో తుల్యంగా భావించిన పద్ధతి ప్రశంసాపాత్రం.

'మా గురుదేవులు' అను వ్యాసంలో 'తిరుపతి శాస్త్రిగారు' తన నాదరించిన తీరును రచయిత స్పష్టంగా చిత్రించి, తన ఆనందం ప్రదర్శించటం సరసులకు ఆనందం కలిగిస్తుంది.

కొన్ని భాషారూపాల భిన్నత మాట కేల గాని ఈ వ్యాససంపుటి, విమర్శనంగా, కళ

రూపంగా, సరసమైన ఆలోచనల చిత్రీకరణగా, ఉత్తమ కవితామూర్తి హృదయగతాలోచన తరంగాలుగా పఠింపదగింది. భద్రపర్చుకోదగింది.

## ప్రేమజ్యోతి

[నవల. చకోవ్‌స్కీ 'ది లైట్ ఆఫ్ ఎ డిస్టెంట్ స్టార్‌కు' శ్రీ రెంటాల గోపాలకృష్ణ అనువాదం. ప్రతులకు: విశాలాంధ్ర ప్రచురణాలయం, ఏలూరు రోడ్డు: విజయవాడ—2. పేజీలు 393. వెల రూ. 4-00.]

ఇది ప్రేమకథ. 'నవలను గురించి' చెప్పిన ముచ్చటయిన మూడు మాటల్లో చెప్పబడ్డ ప్రేమ కథవంటి కథ కాదు. ఉదాత్తమయింది. అమలిన శృంగారం అనే మాటకు అర్థం వుంటే, ఆ అర్థం ప్రేమజ్యోతిపట్ల అన్వర్థం అవుతుంది.

ఈ నవల ప్రేమకు ఒక నిర్వచనం. ఆత్మార్పణకు ఒక ఆరాధన. అర్థంకాని జీవితానికి అర్థం కల్పించే తపన. తాపత్రయం. ఒక ఉత్తమశ్రేణి నవల ఆంధ్రపాఠకలోకం పఠించే సదవకాశం, ఈ నవల అనువాదం, ముద్రణ మూలంగా లభ్యమయింది.

నవల ముగించిన ఎవరికయినా 'జవ్యలోవ్' పట్ల విపరీతమయిన జాలి కలుగుతుంది. అంతటితో నవల ముద్ర పూర్తికాలేదు. ఓల్గాపాత్ర హృదయం కలచివేస్తుంది. అప్పటికీ నవల తన పూర్తి కర్తవ్యం నెరవేర్చుకోలేదు. ఇంకా వుంది. వ్యధిత హృదయం సమాజానికి సమర్పించిన జాగ్రన్మయ మంగళావస్థ భావిభాగ్యోదయానికి నాంది పలుకుతుంటే పాఠకుడి వెన్నెముక ఆనందంతో సంచలించిపోతుంది. అప్పటికి నవల నెరవేర్చవలసిన బాధ్యత పూర్తిగా తీరిపోలేదు. రష్యా జీవితం—సమాజం—మనస్తత్త్వాలు—పాఠకుల్ని కైవసం చేసుకొంటాయి. అయినా నవల వ్యాప్తి అంతమయిందనుకొనే వీలులేదు.

'జవ్యలోవ్'తో పాటు పాఠకుడూ రెట్టింపుతున్న ఉత్సాహంతో ముందుకు సాగుతుంటాడు. పర్యవసానం ఎలా వుంటుందోననే భయం వెన్నంటుతూనే వుంటుందో, ఎలా మారుతుందో జవ్యలోవ్ జీవితం అనుకొనే పాఠకుడికి ఇలా అయిందా అని దిగులు కలుగుతుంది. అలా ముగింపు లేకుండావుంటే నవల పాఠకుల హృదయంలో నిలిచివుండేదికాదు.

యూరి గగారిన్ ఆకస్మిక మరణం దినపత్రికలో ఈ మధ్య చదివిన పాఠకులు, నవలలో ఓల్గా కూడా ఇలాగే అయిపోయింది అనుకోటానికి ఇష్టపడరు. అయితే రచయిత చకోవ్‌స్కీ పదేళ్ల పూర్వం ఊహించిన సత్యం, కవితాసత్యం మాత్రమేకాదు. వాస్తవిక సత్యం.

రెండుమూడుసార్లు మాత్రమే, పరిస్థితుల ఒత్తిడిలో ప్రాబల్యంలో, స్వేచ్ఛా శూన్యస్థితిలో ఓల్గాను కలుసుకొన్న జవ్యలోవ్ ఆమెను మరచిపోలేకపోయాడు. ఆ వ్యవధిలో అవధి చేరుకొన్న అనురాగ జ్యోతి ప్రేమజ్యోతిఅయి, పరంజ్యోతి అయింది.

జవ్యలోవ్ నాగరక మానవ జీవితంనుంచి ఏమీ నేర్చుకోలేని, నేర్చుకోలేకపోయిన దురదృష్టవంతుడని ఎవరయినా అనుకొంటే, అనుకోవటానికి అవకాశాలున్నాయి. గనుక, వాళ్ల పొరపాటు చేసిన వాళ్ళని నిక్కచ్చిగా చెప్ప వీలులేదుగానీ, ఆ జవ్యలోవ్ ఈ నాటి సమాజానికి నేర్పిన అనంత జీవితపుటంచుల ఆనందపు వెల్లువలు, నిష్కల్మష ప్రేమమార్గం తూలనాడగల సామర్థ్యం ఎవరికుంది?

ఏదో దినపత్రికలో ఓల్గా చిత్రపటంచూచి ఆమెకోసం, అన్వేషణ ప్రారంభించిన జవ్యలోవ్ సాగించిన ప్రయాణం, అతని ఆత్రుత, ఆరాటం, ఆశ, ఆకాంక్ష సార్వకాలికాలే అయినా, దినపత్రిక కార్యాలయం, ఫొటోగ్రాఫర్ కలయిక ఇంకా ఇంకా ప్రయత్నం సమగ్ర స్వరూపం ఎలావున్నా, ఒక్కపని ఎందుకు చేయలేక పోయాడా అనిపిస్తుంది. ఒక దినపత్రికలో ఓల్గా నుద్దేశించి, ఒక ప్రకటన, మిత్రుడు మాదిరిగా చేసివుంటే ఆమె ఆచూకీ లభ్యమయివుండేదేమో! ఇంతచిన్న ఆలోచన చకోవ్‌స్కీకి ఎందుకు తట్టలేదు. తట్టలేదనటం సాహసం కావచ్చు అయితే ఆ ప్రయత్నం జవ్యలోవ్ చేయక పోవటం సాహసం.

నవలలోని ప్రతి పాత్రా కళ్లకు కట్టినట్లు వుంటుంది. ఇంత సజీవపాత్ర చిత్రణ—ప్రత్యల్ప పాత్ర చిత్రణలో రచయిత చూపిన జాగరూకత—ప్రశంసాపాత్రమే.

ఓల్గాను వెతుక్కొంటూ జవ్యలోవ్ ఏయే ప్రదేశాలు తిరిగాడో, ఆయాతావులు, పాఠకులు చూస్తున్నట్లే భావించుకొంటారు.

రష్యా జీవితం చదువరులకు ఆశ్చర్యం కలిగిస్తుంది. ముఖ్యంగా శాస్త్రవిజ్ఞానానికి సంబంధించిన పరిశోధనాలయాలు ఎంత గుప్తంగా, నిగూఢంగా వుంటాయో చదువుతుంటే సంభ్రమమే కలుగుతుంది.

ఇటు పట్టణ జీవితం, అటు పల్లె జీవితం, ఇటు శిలవతి నుదుటిపై తెల్లవారిన బ్రతుకు, అటు విచ్చలవిడిగా సంచరించే స్త్రీ జీవితంలో కలిగే ఒడిదుడుకులు సమర్థంగా చకోవ్‌స్కీ చిత్రించిన తీరు గమనార్హం.

ఒక్కొక్కసారి జవ్యలోవ్ పిచ్చివాడా, చేతులోని ఆనందం చేజేతులా వదులుకొని ఆకాశ హర్మ్యంలో గగనకుసుమాలు అలంకరించాలనుకొనే వెర్రివాడా అని అనుమానం కలుగుతుంది.

అతని అన్వేషణను అర్థం చేసుకున్నా, చేసుకోలేకపోయినా పాఠకులుగానీ, నవలలో పాత్రలుగానీ సానుభూతి చూపటంకంటె గత్యంతరం ఉండదు. అసమయం – సమయంమధ్య విషమించిన మానసిక వ్యథతో తల్లడిల్లిన కోమల హృదయుడు 'జవ్యలోవ్'

అనువాదం చాలా సాఫీగా స్వేచ్ఛగా సాగింది. ఇంతపెద్ద అనువాదపు నవలలో దొర్లిన ఒకటి రెండు విపర్యాస్తాలున్నా అవి గమనార్హాలు కావు.

వ్యక్తుల, ప్రదేశాలపేర్లు తొలగించి ఆంధ్రుల పేర్లు మున్నగునవి కల్పించినా, ఈ నవల రష్యా జీవితమే బోధించే తీరులో వుంది గనుక ప్రయోజనం లేదు.

శ్రీ రెంటాల గోపాలకృష్ణ అనువాదం, స్వతంత్ర రచనలాగా సుగమంగా వుంది. ఈ పుస్తకం ఆంధ్ర పాఠకలోకానికి అందించిన అనువాదకర్తా, ప్రచురణకర్తలూ ప్రశంసాపాత్రులు.

—రవి.



Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1.
Editor : S. Sambhu Prasad